శ్రీః

శ్రీకమలాంబికాయై నమః

శ్రీముత్తుస్వామిదీక్షితవిరచితాని

# శ్రీపురకమలాంబికానవావరణకీర్తనాని

వ్యాఖ్యాత : డా॥ తాడేపల్లి పతంజలి



ప్రకాశకులు

**రావి మోహనరావు,** M.Sc., M.A., (Sanskrit)

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

శ్రీకమలాంబికాయై నమః

శ్రీముత్తుస్వామిదీక్షితవిరచితాని

# శ్రీపురకమలాంబికానవావరణకీర్తనాని

వ్యాఖ్యాత : డా॥ తాడేపల్లి పతంజలి

ప్రథమముద్రణ : వినాయకచవితి 22.08.2020

ప్రతులు : 500

పుటలు : 64

వెల : రూ. 40/-



**404, Janjanam Complex,**
**Opp. I Town Police Station,**
**Chirala - 523 155.**
**Cell : 94401 15411**

**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**Karshak Art Printers**
**HYDERABAD**

శ్రీః

శ్రీకమలాంబికాయై నమః

శ్రీముత్తుస్వామిదీక్షితవిరచితాని

# శ్రీపురకమలాంబికానవావరణకీర్తనాని

వ్యాఖ్యాత : డా॥ తాడేపల్లి పతంజలి

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు వారు పుట్టిన ఊరు తిరువారూరు. దీనికి సంస్కృత నామం శ్రీపురం. అందులో వేంచేసిన అమ్మవారి పేరు కమలాంబిక. (శ్రీ లలితా త్రిపురసుందరీ దేవి) ఆమెను ఉద్దేశించి ప్రార్థిస్తూ శ్రీముత్తుస్వామి దీక్షితులు వ్రాసిన నవావరణ కీర్తనలు 11. ఇందులో మొదటిది ధ్యానకీర్తన. చివరిది మంగళ కీర్తన. మధ్యలో ఉన్న తొమ్మిది కీర్తనలు శ్రీచక్రము లోని తొమ్మిది ఆవరణలను వివరించు కీర్తనలు.

ఈ కీర్తనల ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషాలను ఈరోజు నుంచి అమ్మవారి దయతో తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం. అల్పజ్ఞుడనైన నేను ఏవైనా దోషాలు వ్రాస్తే – ఆ అమ్మలగన్న అమ్మ – విద్వాంసులద్వారా నన్ను సరిదిద్దే ప్రయత్నం చేయాలని ప్రార్థిస్తున్నాను.

## 1. కమలాంబికే ఆశ్రితకల్పలతికే చండికే...

**రాగం : తోడి, రూపకతాళం**

పల్లవి : కమలాంబికే! ఆశ్రితకల్పలతికే! చండికే!
కమనీయారుణాంశుకే! కరవిధృతశుకే! మామవ జగదంబికే

అనుపల్లవి : కమలాసనాదిపూజితకమలపదే! బహువరదే!
కమలాలయతీర్థవైభవే! శివే! కరుణార్ణవే!

చరణమ్ : సకలలోకనాయికే! సంగీతరసికే!
సుకవిత్వప్రదాయికే! సుందరి! గతమాయికే!
వికళేబరముక్తిదాననిపుణే! అఘహరణే!
వియదాదిభూతకిరణే! వినోదచరణే! అరుణే!
సకలే! గురుగుహకరణే! సదాశివాంతఃకరణే!
అ-క-చ-ట-త-పాదివర్గే! అఖండైకరసపూర్ణే!

**ప్రతిపదార్థం :** కమల-అంబికే! = కమలాంబికా! (శ్రీలలితా త్రిపురసుందరీదేవి), ఆశ్రిత-కల్పలతికే! = ఆశ్రయించినవారికి కల్పవృక్షము వంటిదానా!, చండికే! = కోపముగల పార్వతీదేవీ!, కమనీయ-అరుణ-అంశుకే = కమనీయమైన ఎఱ్ఱని వస్త్రము ధరించినదానా!, కర-విధృత-శుకే = ఆట కొరకు చేతియందు ధరించిన చిలుక కలదానా!, మామ్ = నన్ను, అవ = రక్షించు, కమలాసన-ఆది-పూజిత = బ్రహ్మాది దేవతలచేత పూజింపబడిన, కమల-పదే! = పాదకమలములు కలదానా!, బహు-వరదే! = బహు వరములను ఇచ్చేదానా!, కమలాలయ-తీర్థ-వైభవే = పద్మము నివాసంగా గల పుణ్యోదక వైభవం కలదానా!, శివే! = మంగళ స్వరూపిణియైన శివా!, కరుణా-అర్ణవే! = కరుణకు సముద్రము వంటిదానా!, సకల-లోక-నాయికే = సకల లోకములకు నాయికా!, సంగీత-రసికే! = సంగీతమునందు ఆసక్తి కలదానా!, సు-కవిత్వ-ప్రదాయికే! = మంచి కవిత్వమును వ్రాయు శక్తినిచ్చేదానా!, సుందరి! = అందమయినదానా!, గత-మాయికే! = మాయకు అతీతురాలా!, వి-కళేబర-ముక్తి-దాన-నిపుణే! = విదేహ ముక్తిని ఇచ్చు నేర్పు కలదానా!, అఘ-హరణే! = పాపములను హరించు దానా!, వియత్-ఆది-భూత-కిరణే! = ఆకాశము మొదలయిన పంచభూతములు నీ చరణ కిరణములుగా కలదానా!, వినోద-చరణే! = మనోహరమైన చరణములు కలదానా!, అరుణే! = రోగమును పోగొట్టు గుణము కలిగిన ఎరుపురంగు కలదానా!, సకలే! = కళలతో కూడినదానా!, కళలు కలిగినదానా!, గురుగుహ-కరణే! = శ్రీముత్తుస్వామి దీక్షితుల వారి కీర్తనలకు సంబంధించిన గురుగుహ ముద్ర కలదానా!, సదాశివ-అన్తఃకరణే! = సదాశివుని అంతఃకరణములో వర్తించుదానా!, (సదాశివుని అంతఃకరణత్వమును అమ్మవారి ధ్యేయరూపముగా - అనగా ధ్యానరూపముగా చెబుతారు.), అ-క-చ-ట-త-పాది-వర్ణే! = వర్ణములలో వర్గముల మొదటి అక్షరములైన అ-క-చ-ట-త-ప అను అక్షరముల స్వరూపిణీ! (అమ్మవారు సకల వర్ణమాలా స్వరూపిణి, సూక్ష్మ మంత్రాక్షర స్వరూపిణి అని భావం), అఖండ-ఏక-రస-పూర్ణే = విభాగం లేని సంపూర్ణమైన ఆనందస్వరూపురాలా! (ఆనంద స్వరూపమైన పరమాత్మకు రసోవైసః అని పేరు.)

**విశేషాలు : చండికే :** చండికలు తొమ్మిది మంది. ఆ నవ-అవతారాలు ఇవి. 1.శైలపుత్రి, 2. బ్రహ్మచారిణి, 3. చంద్రఘంట, 4. కూష్మాండ, 5. స్కందమాత, 6. కాత్యాయని, 7. కాళరాత్రి, 8. మహాగౌరి, 9. సిద్ధిధాత్రి. ఇవి దేవి అవతారములు).

శ్లో॥ ప్రథమం శైలపుత్రీ చ ద్వితీయం బ్రహ్మచారిణీ, తృతీయం
చంద్రఘంటేతి కూష్మాండేతి చతుర్థకమ్ పంచమమ్ ।

స్కందమాతేతి షష్ఠం కాత్యాయనీతి చ సప్తమం కాళరాత్రిశ్చ
మహాగౌరీతి చాష్టమం నవమం సిద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితా ॥

– బ్రహ్మవైవర్తపురాణం.

1. కుమారిక, 2. త్రిమూర్తి, 3. కల్యాణి, 4. రోహిణి, 5. కాళి, 6. చండిక, 7. శాంభవి, 8. దుర్గ, 9. భద్ర (అని కొందరు).

**విదేహముక్తి :** స్థూలదేహం వదలినప్పుడు కలిగే నిర్వాణమనే మోక్షాన్ని విదేహముక్తి అంటారు. (ఘటం నశించినప్పుడు ఘటాకాశం మహాకాశంలో కలసిపోయే విధానం ఉపాధి. అంటే శరీరం చేసే క్రియలు నశించినప్పుడు బ్రహ్మవిదుడు బ్రహ్మంగా కలసిపోతాడు.)

**గురుగుహ :** కుమారస్వామికి గుహుడని పేరు. గూహతి రక్షతి అసౌ రక్షించువాడు కార్తికేయుడు. కుమారస్వామి. పరమశివునికి ప్రణవము కుమారస్వామి ఉపదేశించాడట. దీనికి కారణభూతురాలు పార్వతి. శ్రీముత్తుస్వామి దీక్షితుల వారి ఇష్టదైవం సుబ్రహ్మణ్య స్వామి. ఆయనకు తిరుత్తనిలో శ్రీసుబ్రహ్మణ్యస్వామి దర్శనం లభించిందని ప్రసిద్ధి. ఆ సమయంలోనే ఆయన "**శ్రీనాథాది గురుగుహో జయతి**" అని గానము చేసారట.

## 2. కమలాంబా సంరక్షతు మాం

॥ ప్రథమావరణకీర్తనమ్ ॥ (ప్రథమావిభక్తి) ॥

**రాగం : ఆనందభైరవి, తిశ్ర ఏకతాళం**

శ్రీచక్రములోని ప్రథమావరణమయిన
భూపురాన్ని – **త్రైలోక్యమోహనచక్రాన్ని** వివరించే కీర్తన ఇది

**పల్లవి :** **కమలాంబా సంరక్షతు మాం హృత్**
**కమలానగరనివాసినీ**

**అనుపల్లవి :** **సుమనసారాధితాబ్జముఖీ సున్దరమనఃప్రియకరసఖీ**
**కమలజానన్దబోధసుఖీ కాన్తా తారపఞ్జరశుకీ**

**చరణమ్ :** **త్రిపురాదిచక్రేశ్వరీ అణిమాదిసిద్ధేశ్వరీ నిత్యకామేశ్వరీ**
**క్షితిపురత్రైలోక్యమోహనచక్రవర్తినీ ప్రకటయోగినీ**
**సురరిపుమహిషాసురాదిమర్దినీ నిగమపురాణాదిసంవేదినీ**

**త్రిపురేశీ జననీ త్రిపురభంజనరంజనీ**
**మధురిపుసహోదరీ తలోదరీ త్రిపురసున్దరీ మహేశ్వరీ**

ఈ కీర్తనలో పరదేవత నామములు ప్రథమావిభక్తిలో ఉన్నవి.

**ప్ర :** కమలాంబా = కమలాంబికా (శ్రీలలితా త్రిపురసుందరీదేవి!), మామ్ = నన్ను, సంరక్షతు = రక్షించు, హృత్-కమలా-నగర-నివాసినీ = నా హృదయ కమల నగరములో నివసించుచున్న ఓ కమలాంబ!, సుమనసారాధిత-అబ్జముఖీ = దేవతలు, ఋషులు, జ్ఞానులచేత ఆరాధింపబడినది పద్మం వంటి ముఖం కలదానా!, సుందర మనఃప్రియసఖీ = సుందర సుందరేశ్వరునికి - కామేశ్వరుని ప్రియసఖీ (మీనాక్షీ), కమలజానంద బోధ సుఖీ = బ్రహ్మానందము అను జ్ఞానముతో సుఖముగా ఉన్నదానా!, (సచ్చిదానంద స్వరూపిణి అని భావం), బ్రహ్మానంద బోధచేసి అశుభములకు అనర్థము కలిగించునది. (ఎందరో మహానుభావులు కీర్తనలో త్యాగరాజస్వామి కూడా **కమలజానంద** అన్నారు), కాన్తా = కమనీయమైనది (లలితా సహస్ర నామము), తార పంజర శుకీ = ఓంకా పంజరమునందు చిలుక వలె ఉన్నదానా!, స్వయం ప్రకాశ వస్తువు. (ఓంకారస్తారః) (**ఓంకారపంజరశుకీం** అని కాళిదాసు, **ఓంకారపంజరకీరా** అని త్యాగరాజు), త్రిపురాది చక్రేశ్వరీ = త్రిపురాదేవి, మొదటి ఆవరణమైన భూపురచక్రమునకు ఈశ్వరి. (త్రిపురదేవి మొదలుగా తొమ్మిది చక్రముల ఈశ్వరి యని భావము.), అణిమాది సిద్ధేశ్వరీ = సిద్ధులలో మొదటిది అణిమ. శరీరాన్ని సూక్ష్మాతి సూక్ష్మం చేయగలిగే సిద్ధి. శిలలో సైతం ప్రవేశించడానికి అనువైన సూక్ష్మరూపధారణశక్తి. ఇటువంటి అణిమ మొదలయిన పది సిద్ధులకు ఈశ్వరి. (ఈ దశ సిద్ధులు ప్రదానం చేయగలదని భావం.), నిత్య కామేశ్వరీ = పదునైదు నిత్యలు క్రమముగా **కామేశ్వరీ**, **భగమాలినీ**, **నిత్యక్లిన్నా**, **భేరుండా**, **వహ్నివాసినీ**, **మహావజ్రేశ్వరీ**, **శివదూతీ**, **త్వరితా**, **కులసుందరీ**, **నిత్యా నీలపతాకా**, **విజయా**, **సర్వమంగళా**, **జ్వాలామాలినీ**, **చిత్రా** అనునవి. ఈ పదునైదు నిత్యలతో కోరిన కోర్కెలు ఇచ్చుదానా! అని నిత్యా కామేశ్వరీ అను సంబోధనకు అర్థం. (కామేశ్వరి మొదటి నిత్య), శ్రీవిద్య అని చెప్పబడు చిద్విద్యలో పంచదశబీజములు కామేశ్వరీ మొదలయిన 15 నిత్యలుగా ఉన్నాయని సంప్రదాయం చెబుతున్నది. ఆ పంచదశ బీజ వర్ణాలు పరంజ్యోతి స్వరూపమైన కామకళ అను ఇంకొక పేరు కలిగిన ధ్రువకల నుంచి పుట్టాయి. పంచదశీమంత్ర స్వరూపమైన పంచదశబీజాలు పంచదశి నిత్యలుగా శుద్ధ పాడ్యమి మొదలు అమావాస్య వరకు తిథి రూపాలలో ఉన్నాయి. బహుళపక్షములో ఇవే మరల వెనుక నుంచి వస్తాయి. క్షితిపుర-త్రైలోక్య-మోహన-చక్ర-వర్తినీ = త్రైలోక్య మోహనచక్రమను పేరు కలిగిన భూపురములో తిరిగే దేవతా స్వరూపిణి, ప్రకటయోగినీ

= భూపుర ఆవరణ దేవతలకు ప్రకట యోగునులని పేరు. ఆ దేవతా రూపిణి అయిన శ్రీదేవి ప్రథమావరణ దేవతలు జాగ్రదవస్థయందు మనోవృద్ధిచేయు దేవతలు. అందుచేత వీరికి ప్రకటయోగినులని పేరు. సురరిపు మహిషాసురాది మర్దినీ = దేవతలకు విరోధులైన మహిషాసురుడు (మహిషాసుర శుంభ నిశుంభాది రాక్షసులు) మొదలయిన వారిని సంహరించిన శ్రీదేవి. నిగమ పురాణాది సంవేదినీ = వేదము, పురాణము మొదలయిన వాటిద్వారా బాగా తెలియబడు తల్లీ, త్రిపురేశీ = త్రైలోక్య మోహన చక్రేశ్వరి, గురుగుహ జననీ = కుమారస్వామికి తల్లి, త్రిపురభంజనరంజనీ = త్రిపురాసుర సంహారకుడైన శివునికి ఆనందము కూర్చినదానా!, మధురిపు సహోదరీ = నారాయణుని సహోదరి, తలోదరీ (తల+ఉదరీ) = లోతైన ఉదరము కలది, (ఉదరమునందు అతల, వితల, సుతల మొదలగు చతుర్దశ భువనములు కలది. జగజ్జననీ (లలితా సహస్ర నామావళి లోని నామము ఇది). మహేశ్వరీ = మహేశ్వరుని యొక్క పత్ని.

## 3. కమలాంబాం భజరే

**॥ ద్వితీయావరణకీర్తనమ్ ॥ (ద్వితీయావిభక్తి) ॥**

శ్రీచక్రములోని రెండవ ఆవరణకు సంబంధించిన **సర్వాశాపరిపూరకచక్రము**ను వివరించే కీర్తన ఇది. ఇందులో పదహారు దళాలలో పదహారు మంది దేవతలు ఉంటారు. **షోడశదళచక్రము** అని సంఖ్యాపరంగా చెప్పినా, శాస్త్రపరంగా ఉన్న సర్వాశాపరిపూరకచక్రనామం ప్రసిద్ధి.

పల్లవి : **కమలాంబాం భజ రే రే మానస!**
**కల్పితమాయాకార్యం త్యజ రే**

అనుపల్లవి : **కమలావాణీసేవితపార్శ్వాం కంబుజయగ్రీవాం నతదేవాం నతదేవామ్**
**కమలాపురసదనాం మృదుగదనాం కమనీయరదనాం కమలవదనామ్**

చరణమ్ : **సర్వాశాపరిపూరకచక్రస్వామినీం పరమశివకామినీం**
**దుర్వాసార్చితగుప్తయోగినీం దుఃఖధ్వంసినీం హంసినీం**
**నిర్వాణనిజసుఖదాయినీం నిత్యకల్యాణీం కాత్యాయనీం**
**శర్వాణీం మధుపవిజయవేణీం సద్గురుగుహజననీం నిరఞ్జనీం**
**గర్వితభణ్డాసురభఞ్జనీం కామాకర్షిణ్యాదిరఞ్జనీం**
**నిర్విశేషచైతన్యరూపిణీం ఉర్వీతత్త్వాదిస్వరూపిణీం**

ప్ర : కమలాంబామ్ = కమలాంబికను (శ్రీలలితా త్రిపుర సుందరీదేవిని), భజ = సేవింపుము, రే రే మానస! = ఓ మనసా!, కల్పిత మాయా–కార్యమ్ = కల్పించుకొన్న ప్రాపంచిక సంబంధమయిన ఆకర్షణల భ్రాంతులను (లోక వ్యవహారాలను) నిలిచేది కాదని తెలిసినా వెంట పడుతుంటాము కనుక అది మాయ. దానిని విడిచిపెట్టమని భావం), త్యజ రే = దయ చేసి విడిచిపెట్టు, కమలా–వాణీ–సేవిత–పార్శ్వామ్ = వింజామరలను ధరించిన లక్ష్మీసరస్వతులచే పార్శ్వభాగములందు (శరీరము ప్రక్క భాగము) సేవింపబడు దేవిని, విశేషము : ఈ నామము "**సచామరరమావాణీసవ్యదక్షిణ సేవితా**" అను లలితాసహస్రనామమునకు పోలిక కలిగి ఉన్నది. లక్ష్మీసరస్వతులు విడివిడిగా ఏయే ఫలితాలను ఇస్తారో, ఆ రెండింటిని కలిపి కమలాంబ ఇవ్వగలదని సారాంశం. సంపదలు, విద్యలు అమ్మవారి సేవకే వినియోగించాలని మరో అంతరార్థ సందేశం. కంబు–జయ–గ్రీవామ్ = శంఖాన్ని జయించిన కంఠం కల తల్లిని, విశేషం : సులలితనవయౌవనారంభచంద్రోదయోద్వేలలావణ్యదుగ్ధార్ణవావిర్భవత్ కంబుబింబోక–భృత్కంధరే (పున్నమివేళ ఉప్పొంగిన పాలసముద్రంలో పుట్టిన శంఖంలా అమ్మవారి కంఠం ఉంది), అని కాళిదాసు శ్యామలాదండకంలో అమ్మవారి కంఠాన్ని వర్ణించారు. శంఖం కళలకు నిలయం. ధ్వనితో జలంతో కూడుకొన్నది. కళలకు మందిరం కంఠం. ఇది కూడా ధ్వనితో, జలంతో కూడుకొని ఉన్నది. శంఖంలో మూడు సుడులు. కంఠంలో మూడు రేఖలు. అందుకే శంఖానికి కంఠానికి పోలిక. ఇక్కడ ముత్తుస్వామి దీక్షితుల వారు శంఖాన్ని మించిన కంఠమని వర్ణించారు. నత–దేవామ్ = దేవతలచేత నమస్కరింపబడే తల్లిని (అనగా సర్వదేవతలు అమ్మవారి ఆజ్ఞానువర్తులని భావం), కమలాపుర–సదనామ్ = కమలాపురము అనగా తిరువారూరు తన నివాసముగా గల దేవిని, మృదు–గదనామ్ = మెత్తగా పలికే తల్లిని (మృదువుగా మాట్లాడే దేవిని) విశేషం : మృదువుగా మాట్లాడే దేవి మాటలు కవి విన్నారు. కనుకనే కవి నోట ఈ మాట. కమనీయ–రదనామ్ = అందమయిన పలువరుస కల తల్లిని (అమ్మ నవ్వుతూ మాట్లాడే సందర్భంలో కవి సందర్శనము చేసాడు కనుక ఆమె పలువరుస మనోహరమని వర్ణిస్తున్నాడు). కమల–వదనామ్ = కమలము వంటి మోము కల దేవిని కం జలం అలతి భూషయతి. నీటిని అలంకరించునది కమలము. ప్రార్థిస్తే ఈ జీవితాన్ని అలంకరించేది ఆ కమలవదన. సర్వాశా–పరిపూరక–చక్ర–స్వామినీమ్ = సర్వాశా పరిపూరక చక్ర అధికారిణివి. అన్ని కోరికలను తీర్చుతున్న తల్లి ఒక అర్థం. ఆశా అనగా దిక్కు. (ఆసమంతాత్ సర్వత్ర అశ్నుతే అంతట వ్యాపించునది దిశ.) అన్ని దిక్కులలోను వ్యాపించిన విశ్వవ్యాపిని అయిన తల్లి.

**విశేషాలు :** శ్రీచక్రంలోని రెండవ ఆవరణకు **సర్వాశాపరిపూరక** చక్రమని పేరు. ఆమె త్రిపురసుందరి. మూడు పురాలు అవి త్రిగుణాలు కావచ్చు. అవస్థాత్రయం కావచ్చు. స్థూలసూక్ష్మకారణాలనే మూడు శరీరాలు కావచ్చు. పృథివ్యాదులైన మూడులోకాలు కావచ్చు. మొత్తానికి అన్నీ త్రిపురాలే. చిచ్ఛక్తితో పూర్తిగా నిండిపోయినవే. ఈ మూడింటిలో ఎదురులేకుండా విహరించే చిచ్ఛక్తి స్వరూపిణి అయిన దేవి త్రిపురసుందరి.

ఈ సర్వాశాపరిపూరకచక్రము సకార ప్రకృతితో ఉంటుంది. చంద్రకళలకు ప్రతీక. తెలుపు రంగు కలది. అమృతరసస్రావము కలిగినది.

ఇందులో పదహారు మంది (షోడశ) దేవతలున్నారు. వారు నిత్యాకళలు. వారు వరుసగా **కామాకర్షణీ, బుద్ధ్యాకర్షణీ, అహంకారాకర్షణీ, శబ్దాకర్షణీ, స్పర్శాకర్షణీ, రూపాకర్షణీ, రసాకర్షణీ, గంధాకర్షణీ, చిత్తాకర్షణీ, ధైర్యాకర్షణీ, స్మృత్యాకర్షణీ, నామాకర్షణీ, బీజాకర్షణీ, ఆత్మాకర్షణీ, అమృతాకర్షణీ, శరీరాకర్షణీ**. వీరంతా యోగినులు. అకారాది 16 స్వరములుగా ఉన్న షోడశదళములలో –అ నుంచి అః వరకు వీరుంటారు. సర్వాశా–పరిపూరక–చక్రములో రసము వీరము. *

పరమశివకామినీమ్ = పరమశివ అంటే పరబ్రహ్మ. సృష్టి స్థితి లయాలు చేసే బ్రహ్మ విష్ణు శివుల కంటె అతీతమైన వాడు పరబ్రహ్మ. అట్టి పరబ్రహ్మయొక్క శక్తి పరమశివకామిని.

దూర్వాసార్చితగుప్తయోగినీమ్ = దూర్వాసునిచేత అర్చింపబడిన గుప్తయోగినీ స్వరూపిణియగు శ్రీదేవియని ఈ నామ భావం. రెండవ ఆవరణమునందున్న 16 దేవతలకు గుప్తయోగినులని ఇంకొక పేరు. వీరంతా శ్రీదేవి స్వరూపాలు. పన్నుండు మంది శ్రీవిద్యా చక్రవర్తులలో దూర్వాసుడొకడు. దూర్వాసుడు కాంచీపురకామాక్షికి ఆరాధనపద్ధతిని ఏర్పరచినవాడు. లలితాస్తవరత్నమను శ్రీపురవర్ణనమును, శక్తిమహిమ స్తోత్రము రచించాడని చెబుతారు.

దుఃఖధ్వంసినీమ్ = సకలమైన దుఃఖములను అజ్ఞానము వలన వచ్చు అనర్థములను నాశనము చేయునది. జనన మరణ రూపమైన దుఃఖాన్ని పోగొట్టి మోక్షాన్ని అనుగ్రహించే తల్లి.

హంసినీమ్ = ఆత్మ మంత్ర స్వరూపిణి. ఆత్మబ్రహ్మైక్యానుభవమును స్వయం ప్రకాశము చేయునది హంసిని.

---

* మాలామంత్రోద్ధారము 2–19. 'కామాకర్షణ్యాదయః షోడశశక్తయః' అనుటను ఉద్ధరించి శ్రీభాస్కరరాయలువారు "ఆకర్షిణి" అనరాదు అని సూచించిరి.

నిర్వాణనిజసుఖప్రదాయినీమ్ = తనదైన నిత్యానందము ఇచ్చి మోక్షము నిచ్చునది. లలితా సహస్ర నామావళిలో **శివజ్ఞానప్రదాయిని(727 నామం)** శివ సంబంధమైన జ్ఞానమును ఇచ్చునది. అది ఇదే. **స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతతిః** – (బ్రహ్మానందమును మించిన పరమానందస్వరూపిణి ) నామము కూడా ఇదే పద్ధతిలోనిది.

నిత్యకల్యాణీమ్ = నాశరహితమైన సుఖస్వరూపిణి. నాశరహితమయిన సుఖమే ఆనందము, మోక్షము. శ్రీదేవి '**నిత్యకల్యాణలీల**' అని మంత్రధ్యాన శ్లోకము.

కాత్యాయనీమ్ : అఖండ తేజోస్వరూపిణిని కాత్యాయని అంటారు. శ్రీ లలితా సహస్ర నామావళియందు 556వ నామము కాత్యాయని.

"తచ్చాపి తేజో పరముత్తమం మహన్నామ్నీ – సర్వదేవ తేజస్సమూహముతో అమ్మవారు ఆవిర్భవించినదని బ్రహ్మాండ పురాణము. దేవీ మాహాత్మ్యం మొదలయిన గ్రంథాలు చెబుతున్నాయి. **నిజారుణప్రభాపూరమజ్జద్బ్రహ్మాండమండలా** : (తన సహజమైన ఎఱ్ఱని కాంతుల నిండుదనములో మునుగుతున్న బ్రహ్మాండముల సముదాయము కలది. ) అను లలితాసహస్రనామంలో అమ్మవారి తేజస్సుయొక్క విస్తృతి చెప్పబడింది.

శర్వాణీమ్ = అష్టమూర్తియగు శివునికి శర్వుడని పేరు. శర్వుని పత్ని శర్వాణి.

మధుప–విజయ–వేణీమ్ = తుమ్మెదలను గెలిచిన జడ కలది. తుమ్మెదల మేని నల్లదనాన్ని మించిన కాంతి కల జడ కలది.

సద్గురుగుహ–జననీమ్ = జ్ఞానాన్ని బోధించి, ఆ మార్గంలో మనలను నడిపే వాడు సద్గురువు. ఆ గురువు రహస్యతత్త్వవేత్త కనుక గుహుడు. అటువంటి సద్గురుగుహులకు జనని. జనని అంటే కారణం. ఇదొక అర్థం. సద్గురుగుహుడు కుమారస్వామి. ఆయన జనని కనుక సద్గురుగుహ–జనని.

నిరంజనీమ్ = అంజనమనగా ఇక్కడ అజ్ఞానము అని అర్థం. అజ్ఞానము లేని తల్లి. అజ్ఞానమును పోగొట్టిన జ్ఞానస్వరూపిణి.

గర్వితభంధాసురభంజనీమ్ = గర్వముచేత మత్తుడైన భండుడను రాక్షసుని అణచినట్టి శ్రీదేవి. భండాసురుని వృత్తాంతము లలితోపాఖ్యానమున ఉన్నది. భండాసురుని గురించి ప్రసక్తి గల నామములు లలితాసహస్రంలో ఉన్నాయి. (**భండాసురవధోద్యుక్తశక్తిసేనాసమన్వితా** – 65, **భండసైన్యవధోద్యుక్తశక్తివిక్రమహర్షితా** – 72, **భండపుత్రవధోద్యుక్తబాలావిక్రమనందితా** – 74, **భండాసురేంద్రనిర్ముక్తశస్త్రప్రత్యస్త్రవర్షిణీ** – 79), మన్మథుడు దహింపబడుటవలన ఏర్పడిన బూడిదను విఘ్నేశ్వరుదు చిత్రాకారమైన బూడిదగా చేసెను.

అప్పుడు వానిని చూచి బ్రహ్మ "భండ భండ" (ఆశ్చర్యమాశ్చర్యము) అనుటచే వానికి భండుడని పేరువచ్చినదట. రుద్రుని కోపాగ్ని వలన పుట్టిన భండుడు రౌద్ర స్వభావం కలవాడై రాక్షసుడయ్యాడు. అతని గర్వమును నశింపచేసినది శ్రీదేవి. భండయనగా లజ్జ లేని వాడని భావం. ప్రకృతి యందు జీవభావము పొందిన దేహి. అనగా సుఖదుఃఖాదులచే పీడింపడు దేహి. అట్టివాని గర్వమును పోగొట్టునది జ్ఞానప్రదాయిని..

భండుడు కరుడు కట్టిన అవిద్య. అవిద్యను రూపు మాపునది కనుక గర్వితభండాసుర భంజని.

కామాకర్షిణ్యాదిరంజనీమ్ = రెండవ ఆవరణయగు షోడశదళమందు ఒక్కొక్క దళమందు ఒక్కొక్క దేవత కలదు. వారు కామాకర్షిణి మొదలగు వారు. ఈ కామాకర్షిణ్యాది ఆవరణ దేవతలకు ఆనందమును కూర్చునట్టి తల్లి. వారి రూపమైన తల్లి కామాకర్షిణ్యాదిరంజని.

నిర్విశేషచైతన్యరూపిణీమ్ = విశేషమనగా గుణం లేని ఉపాధి. గుణములు లేని ఉపాధి లేని అభేదజ్ఞానమునకు 'నిర్విశేషచిత్" అని పేరు. దీని స్వరూపమే నిర్విశేష చైతన్యం. తద్రూపిణి. నిర్విశేషచైతన్యరూపిణి అని భావం. **సర్వోపాధివినిర్ముక్తా** (లలితా సహస్రనామం) అన్నిచోట్లా వ్యాపించి దేనియందు ఇమడని తల్లి నిర్విశేష అవిద్యా నివారకత్వం రూపం. సామర్థ్యం చైతన్యం పర్యాయం వా చిచ్ఛక్తిః. "**సర్వచైతన్యరూపాం తాం ఆద్యాం విద్యాం చ ధీ మహి బుద్ధిః నః ప్రచోదయాత్**" అని కలదు. (సర్వచైతన్య రూపమైనది. ఆద్యనుయైన విద్యను ప్రార్థింతును. మా బుద్ధులను ప్రేరేపించునుగాక (దేవీభాగవతం)

ఉర్వీతత్త్వాదిస్వరూపిణీమ్ = జ్ఞానేంద్రియాలు (5), కర్మేంద్రియాలు (5), పంచప్రాణాలు (5), జ్ఞాన తన్మాత్రలు (5), అంతరింద్రియాలు (4), పురుషుడు (1) వెరసి ఇరవై ఐదు. కొందరు శివుడు మొదలు పృథివ్యంతములైన తత్త్వములు **36** అని చెబుతారు. వీటి స్వరూపిణీ అనగా **సచ్చిదానందరూపబ్రహ్మ**మని ఇంకొక అర్థం.

**తా :** కమలా వాణీ సేవిత పార్శ్వ అయిన కమలాంబను, కంబుజయగ్రీవ అయిన కమలాంబను, దేవతలచేత నమస్కరింపబడిన కమలాంబను, కమలాపురమను తిరువారూరునందు వెలసిన కమలాంబను, మృదువైన వాక్కుగల కమలాంబను, కమనీయమైన దంతపంక్తికల కమలాంబను, కమలముల వంటి నేత్రములు కల కమలాంబను, సర్వాశాపరిపూరకచక్రస్వామిని అగు కమలాంబను, శివకామిని అగు కమలాంబను, దూర్వాసుని చేత అర్చింపబడిన గుప్తయోగిని యగు కమలాంబను,

దుఃఖధ్వంసిని యగు కమలాంబను, హంసినియగు కమలాంబను, నిర్వాణనిజ సుఖదాయినియగు కమలాంబను, నిత్యకల్యాణియగు కమలాంబను, కాత్యాయని యగు కమలాంబను, శర్వాణి యగు కమలాంబను, తుమ్మెదల సమూహము వంటి అందమగు కేశపాశముగల, సద్గురుగుహజననియగు, నిర్విశేషచైతన్య స్వరూపిణియగు కమలాంబను, ఉర్వీతత్త్వరూపిణియగు కమలాంబను, నిరంజనియగు కమలాంబను, భండాసురాది రాక్షసుల గర్వమును హరించిన కమలాంబను, కామ్యాకర్షిణ్యాది ద్వితీయావరణ దేవతలకు సంతోషమిచ్చు కమలాంబను, ఓ మానసమా! సేవింపుము. మాయా కార్యములను త్యజించుము.

**విశేషాలు :** 1. **కమలనయనాం** అని మరొక పాఠాంతరం. పద్మముల వంటి కన్నులు కల దేవి యని ఈ సంబోధనకు అర్థం.

2. వాగ్భవకూటమే అమ్మవారి మోము కనుక అమ్మవారి ముఖధ్యానమును దీక్షితుల వారు వర్ణించారు. "**శ్రీవాగ్భవకూటైకస్వరూపముఖపంకజా**" అని ఒక లలితాసహస్ర నామం.

3. అమ్మవారి పంచదశ మంత్రాన్ని దానిని మూడు భాగాలుగా చేస్తే మొదటిది వాగ్భవ కూటము. రెండవది మధ్యకూటము. మూడవది శక్తి కూటము.

4. ఎవరైనా లోకంలో చక్కగా మాట్లాడుతుంటే తదేకంగా అలాగే చూస్తాం. మరి మాట్లాడుతున్నది... దేవి...

5. దీక్షితుల వారు ఆ ముఖదివ్యసౌందర్యాన్ని తదేకధ్యానంతో తన్మయత్వంతో దర్శించి ఆ ముఖమండలంలోని దివ్యశోభను మన అదృష్టం కొద్దీ ఈ కీర్తనలో విశేషణాలుగా మనకు అందించారు.

6. మూడువేదాల ప్రథమాక్షరాల సంపుటిగా "ఐ" అను అక్షరంగా చెబుతారు.

7. అక్షరానికి బిందువు చేరితే అది బీజాక్షరం. కనుక "ఐం" అనేది బీజాక్షరం.

8. ఈ ఐం అనేది వాక్-భవ అంటే వాగ్భవబీజం.

9. దీక్షితుల వారి ఈ కీర్తనలోని ఈ ముఖసౌందర్యవర్ణనలో ఈ వాగ్భవబీజోపాసన మార్గం ఉన్నది.

10. రెండవ ఆవరణ స్వప్నావస్థలో మనోవృద్ధికి సంబంధించినది. స్వప్నమందు "తృప్తి" విషయము సూక్ష్మము. గుప్తము. గుప్తమగుట వలన యీ ఆవరణ దేవతలకు గుప్తయోగినులని ఇంకొకపేరు.



## 4. శ్రీకమలాంబికయా

**॥ తృతీయావరణ కీర్తనమ్ ॥ (తృతీయావిభక్తి) ॥**

ఎనిమిది దళాలలో ఉన్న తల్లుల వర్ణన తృతీయావరణకీర్తనలో ఉంది. **సర్వసంక్షోభణచక్రం** ఇది. వర్ణం జపాకుసుమంలా ఎరుపురంగుతో ఉంటుంది. జపాకుసుమాన్ని కొందరు గులాబీ అంటారు.

**రాగం : శఙ్కరాభరణం, రూపకతాళం**

పల్లవి : **శ్రీకమలాంబికయా కటాక్షితోఽహం**
**సచ్చిదానన్దపరిపూర్ణబ్రహ్మోఽస్మి**

అనుపల్లవి : **పాకశాసనాదిసకలదేవతాసేవితయా**
**పఙ్కజాసనాదిపఞ్చకృత్యకృద్భావితయా**
**శోకహరచతురపదయా మూకముఖ్యవాక్ప్రదయా**
**కోకనదవిజయపదయా గురుగుహతత్త్వైకపదయా**

చరణమ్ : **అనంగకుసుమాద్యష్టశక్త్యాకారయా**
**అరుణవర్ణసంక్షోభణచక్రాకారయా**
**అనన్తకోట్యణ్డనాయకశఙ్కరనాయికయా**
**అనంగాద్యుపాసితయా అష్టదళాబ్జస్థితయా**
**అష్టవర్గాత్మకగుప్తతరయా పరయా**
**ధనుర్బాణధరకరయా దయాసుధాసాగరయా**

ప్ర : శ్రీకమలామ్బికయా = శ్రీకమలాంబిక అనుగ్రహము చేత, కటాక్షితః = కటాక్షింపబడిన వాడను, (అమ్మవారి చూపు జ్ఞానము) (అమ్మవారు నన్ను కటాక్షించారని భావం), అహమ్ = నేను, సచ్చిదానన్ద పరిపూర్ణ – బ్రహ్మో అస్మి = సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మమును అయి ఉన్నాను, మనందరిది దేహోస్మి (దేహమును అయి ఉన్నాను.) ముత్తుస్వామి దీక్షితుల వారిది బ్రహ్మోస్మి (బ్రహ్మమును నేను అయి ఉన్నాను) స్థితి. అనుభవవాక్య (అహం బ్రహ్మోస్మి) ప్రతిబింబము ఈ పంక్తి. పాకశాసనాది సకల దేవతా సేవితయా = ఇంద్రాది సకల దేవతాసమూహముచే సేవింపబడిన శ్రీకమలాంబ చేత, ఇంద్రాది సకల దేవతల చేత శ్రీదేవి సేవింపబడినది. రాక్షసులవలన తమకు ఆపదలు వచ్చినప్పుడు ఇంద్రాది దేవతలు శ్రీదేవిని ప్రార్థించి ఆమె కృపచేత తమ కష్టాలను నివారింప చేసికొనుట ప్రసిద్ధము. బ్రహ్మాండ, మార్కండేయ, కాళికా పురాణములలో

దేవీభాగవతములో ఈ కథలు ఉన్నాయి. "**పురందరాది బృందారక బృంద సేవిత**" అని కాళిదాసు ప్రయోగం. అమ్మవారికి సర్వదేవతలు ఆరాధన చేసారని ప్రతి కీర్తనలో చెప్పుట వలన అమ్మవారి ఆధిక్యతతో పాటు, అందరు దేవతలు ఆరాధిస్తున్నారు కదా... ఇక నేను అనగా ఎంత అనే వినయభావం వస్తుంది. పఙ్కజాసనాది పఞ్చకృత్య కృత్ భావితయా = పంకజాసనుడు అనగా బ్రహ్మ. పంచకృత్య పరాయణులైన బ్రహ్మ మొదలయిన వారి చేత – భావింపబడుచున్న శ్రీ కమలాంబ చేత, విశ్వముయొక్క సృష్టి, రక్షణ, నాశ, తిరోధాన, అనుగ్రహములనెడు పంచకృత్యాలు చేయువారు పంచబ్రహ్మలు. సృష్టి మొదలయిన పంచకృత్యములలో శివుడు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములను పంచరూపాలు ధరించాడని ఒక సమన్వయం. గరుడపురాణములో విష్ణువు పంచరూపాలు ధరించాడని ఉంది. (వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారాయణ). త్రిపురా సిద్ధాంతములో బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు పంచబ్రహ్మ లని ఉన్నది. ఈ పంచబ్రహ్మలు తమ తమ పనులు చేయునప్పుడు శ్రీదేవిని భావించుచుందురని భావం. ఇంద్రులు సేవిస్తే పంచకృత్య పరాయణులు భావిస్తారని ఒక మెట్టు ఎక్కువగా కవి చెప్పారు. శోక హర చతుర పదయా = శోకమును హరించు చాతుర్యముగల పదములుగల శ్రీ కమలాంబ చేత, శోకమనగా దుఃఖము సాంసారికము . దుఃఖమును హరించు సామర్థ్యము కలిగిన పాదములు కలిగినది శ్రీదేవి. సంసారబాధల నుండి ముక్తి (దుఃఖం నుంచి విముక్తి) యే మోక్షము. ముక్తుడు దుఃఖము నుండి విడివడినవాడని శ్రుతి ప్రమాణము. (దుఃఖేనాత్యంతశ్చరతి) అమ్మవారి చరణములు జ్ఞానమూర్తులు. జ్ఞానము అజ్ఞానమును (దుఃఖమును) పోగొడుతుంది. మూక ముఖ్య వాక్ ప్రదయా = మూకకవి మొదలగు వారికి వాక్కును అనుగ్రహించిన శ్రీ కమలాంబచేత, కోకనద విజయ పదయా = పద్మములను జయించిన పదములుగల శ్రీ కమలాంబ చేత, (**పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా** అను లలితా నామమునకు ఇది సన్నిహితం), గురుగుహ తత్త్వైక పదయా = కుమార స్వామి ఉపదేశించిన తత్ పద లక్ష్యార్థమైన శ్రీకమలాంబ చేత, తత్త్వాన్ని చెప్పే పదము తత్త్వైక పదము. ఏక పదము అనగా ఉత్తమమయిన పదం. తత్త్వైక పదయా = పదములను ఆశ్రయించినవారికి గురుగుహ తత్త్వమును ప్రసాదించునది. తత్త్వమసి ఉపదేశ వాక్యము. గురువు చెప్పే రహస్య వాక్యము గురుగుహ తత్వము. (సుబ్రహ్మణ్యతత్త్వము), తత్త్రైపదయా అను ఇంకొక పాఠాంతరమునకు అర్థమిది. తత్ త్వం అసి మూడు పదాలు తత్త్రైపదము. (తత్ – త్రై పదము), 'తత్త్వమసి' అను మహావాక్యమున తత్, త్వం, అసి అను మూడు పదములున్నవి. ఈ మూడును తత్త్రైపదములు. ఈ తత్త్వమసి ఉపదేశవాక్యము గురుగుహ ఉపదేశితము.

ఈ మహావాక్యము ఆత్మబ్రహ్మైక్యతా లక్ష్యమును శోధించునని పెద్దలు చెబుతారు. పదములు అనగా స్థానములు. పదములు అనగా పాదములు. మొదటి అర్థంలో ఆమె పదాలు జపిస్తే శోకహరణం. రెండవ అర్థంలో ఆమె పాదాలు జపిస్తే శోకతరణం. అనంగకుసుమాది అష్టశక్త్యాకారయా = అనంగ కుసుమాది అష్టశక్తుల ఆకారముకల శ్రీకమలాంబచేత, శ్రీచక్రమున మూడవ ఆవరణయగు అష్టదళపద్మములో **అనంగ–కుసుమా , అనంగమేఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగ–వేగినీ, అనంగాంకుశా, అనంగమాలినీ** అను అష్టశక్తులున్నాయి. శ్రీదేవి ఈ అష్టశక్తుల స్వరూపిణియని భావము. ఈ అష్టశక్తుల పేర్లలో ముందు "అనంగ" అను పదమున్నది. అనంగ పదమునకు అనంగునితో కూడిన శరీరులని భావము. స్థూల, సూక్ష్మ శరీరములు రెండును లేనివారని భావము. జపాకుసుమ దేహ సంకాశులు వీరు. అరుణవర్ణసంక్షోభణ చక్రాకారయా = అరుణ వర్ణముగల సంక్షోభణ చక్రాకారముకల శ్రీకమలాంబచేత, కలవరపరచగలిగినది సంక్షోభణము. అనన్త కోట్యణ్డ నాయక శఙ్కర నాయికయా = అనంతకోటి బ్రహ్మాండ నాయకుడు శంకరునికి నాయిక యగు శ్రీకమలాంబ చేత, **అనంతకోటిబ్రహ్మాండజననీ**... అను లలితా నామమును ఇక్కడ అనుసంధానం చేసుకోవాలి. ఈ బ్రహ్మాండనాయకుడు "శంకరుడు" అనుట గమనార్హము. శుభాన్ని ఇచ్చేవాడు శంకరుడు. లోకరక్షకుడు. అష్టవర్గాత్మక గుప్తతరయా పరయా = అష్టవర్గాత్మక మాతృకావర్ణ స్వరూపముగల గుప్తతర యోగినియైన తనకన్న గొప్పవారు లేని శ్రీకమలాంబ చేత, అష్టవర్గమనగా ఇక్కడ అక్షర వర్గము. పంచాశద్వర్ణములు (50 అక్షరాలు) అష్టవర్గములుగా విభజింపబడియున్నవి. అ,క,చ,ట,త,ప,య,శ అను అక్షరములు వర్గాది అక్షరములు. శ్రీదేవి మాతృకా వర్ణరూపిణి. ఒక్కొక్క వర్గముతో ఒక్కొక్క దేవతను కలుపుతూ ఆరాధన చేయబడుట సంప్రదాయం. ఈ విధముగా త్రిపురసుందరి గుప్తతరయోగినీ దేవతలతో కూడి ఉన్నది కనుక అష్టవర్గాత్మక గుప్తతర అగుచున్నది. అనంగాది ఉపాసితయా = మన్మథుడు మొదలగువారిచేత ఉపాసింపబడిన శ్రీకమలాంబ చేత, పరదేవతయగు శ్రీదేవిని ఉపాసించిన శ్రీవిద్యా చక్రవర్తులలో అనంగుడైన మన్మథుడొకడు. మను, చంద్ర, కుబేర, లోపాముద్రా, మన్మథ, అగస్త్య, అగ్ని, సూర్య, ఇంద్ర, షణ్ముఖ, ఈశ్వర, దూర్వాసో ఋషులు పన్నెండు మంది శ్రీవిద్యా చక్రవర్తులు. (మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రా చ మన్మథః అగస్తి రగ్ని సూర్యశ్చ ఇంద్రస్కందశ్శివస్తథా క్రోధభట్టారకో దేవ్యా ద్వాదశామీ ఉపాసకాః) అనంగునికి సంబంధించిన కాది విద్యను గృహస్థులు అర్చిస్తారని, హాది విద్యను కేవలం నివృత్తిని అభిలషించేవారు పాటిస్తారని ఒక సంప్రదాయం. "**ఆత్మవిద్యా మహావిద్యా శ్రీవిద్యా**

**కామసేవితా**" అని లలితా సహస్రనామం దీక్షితుల వారి భావనకు సన్నిహితం. అష్టదళాబ్జ స్థితయా = మూడవ ఆవరణ యగు అష్టదళమునందు అనగా ఎనిమిది దళములుగల పద్మము నందు నివసించు శ్రీకమలాంబ చేత, సాధారణంగా దేవతను ఉపాసించేటప్పుడు ఎనిమిది దళాలు గల పద్మంలో ఉన్నట్లుగా ఉపాసన చేయాలని శాస్త్రం. **అష్టదళో-పరివేష్టితలింగం**... అని లింగాష్టకం. ధనుర్బాణ ధర కరయా = ధనుర్ బాణములను ధరించిన శ్రీకమలాంబచేత, దయా సుధా సాగరయా = దయామృతసముద్రరూపిణి యగు శ్రీకమలాంబచేత

**తా :** ఇంద్రాది సకల దేవతాసమూహముచే సేవింపబడిన శ్రీకమలాంబ చేత పంచకృత్య పరాయణులైన బ్రహ్మాదులచే ధ్యానింపబడుచున్న శ్రీకమలాంబ చేత, శోకమును హరించు చాతుర్యముగల పదములుగల శ్రీకమలాంబ చేత, మూకకవి మొదలగు వారికి వాక్కును అనుగ్రహించిన శ్రీకమలాంబచేత, పద్మములను జయించిన పదములుగల శ్రీకమలాంబ చేత, కుమారస్వామి ఉపదేశించిన తత్ పద లక్ష్యార్థమైన శ్రీకమలాంబ చేత, అనంగ కుసుమాది అష్టశక్తుల ఆకారముకల శ్రీకమలాంబ చేత, అరుణ వర్ణముగల సంక్షోభణ చక్రాకారముకల శ్రీకమలాంబ చేత, అనంతకోటి బ్రహ్మాండ నాయకుడు శంకరునికి నాయిక యగు శ్రీకమలాంబ చేత, అష్టవర్గాత్మక మాతృకావర్ణ స్వరూపముగల గుప్తతరయోగినియైన శ్రీకమలాంబ చేత, తనకన్న వారు లేని శ్రీకమలాంబ చేత, మన్మథుడు మొదలగువారిచేత ఉపాసింపబడిన శ్రీకమలాంబ చేత, మూడవ ఆవరణయగు అష్టదళమునందు వసించు శ్రీకమలాంబ చేత, దయామృతసాగరయగు శ్రీకమలాంబ చేత, శ్రీకమలాంబిక చేత నేను కటాక్షింపబడిన వాడను, నేను సచ్చిదానంద పరిపూర్ణ బ్రహ్మమును.

**వి :** ఈ కీర్తన మూడవ ఆవరణకు సంబంధించినది. ఇది మూడవ విభక్తియందున్నది. (టా). మూడవ ఆవరణము అష్టదళపద్మము. దీనికి **సర్వసంక్షోభిణీచక్రమ**ని పేరు. హకార ప్రకృతి కలది. జపాకుసుమమిత్రము. ఇచట ఎనిమిది దేవతలున్నారు. వారు **అనంగకుసుమా, అనంగమేఖలా, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగరేఖా, అనంగ వేగినీ, అనంగాంకుశా, అనంగమాలినీ** అనువారలు. వీరు జపాకుసుమ సంకాశమైన దేహకాంతి కలవారు. ఈ ఆవరణ దేవతలకు **గుప్తతరయోగినుల**ని పేరు. ఈ చక్రేశ్వరి **త్రిపురసుందరి**, రసము కరుణ. ఈ మూడవ ఆవరణ దేవత త్రిపురసుందరి యను పేరు కలది. జాగ్రత్ స్వప్న సుషుప్తులు మూడుదశలు. అవే మూడు పురములు. ఈ అవస్థాత్రయమునకు అమ్మ అధిష్ఠాత్రి.



## 5. కమలాంబికాయై

॥ చతుర్థావరణకీర్తనమ్ ॥ (చతుర్థీవిభక్తి) ॥

రాగం : కాంభోజి, అట తాళం

**పల్లవి :** కమలాంబికాయై కనకాంశుకాయై
కర్పూరవీటికాయై నమస్తే నమస్తే

**అనుపల్లవి :** కమలాకాంతానుజాయై కామేశ్వర్యై అజాయై
హిమగిరితనుజాయై హ్రీంకారపూజ్యాయై
కమలానగరవిహారిణ్యై ఖలసమూహసంహారిణ్యై
కమనీయరత్నహారిణ్యై కలికల్మషపరిహారిణ్యై

**చరణమ్ :** సకలసౌభాగ్యదాయకాంభోజచరణాయై
సంక్షోభిణ్యాదిశక్తియుతచతుర్థావరణాయై
ప్రకటచతుర్దశభువనభరణాయై
ప్రబలగురుగుహసంప్రదాయాంతఃకరణాయై
అకళంకరూపవర్ణాయై అపర్ణాయై సుపర్ణాయై
సుకరధృతచాపబాణాయై శోభనకరమనుకోణాయై

సకుంకుమాదిలేపనాయై చరాచరాదికల్పనాయై
చికురవిజితనీలఘనాయై చిదానందపూర్ణఘనాయై.

**ప్ర :** కమలాంబికాయై = కమలాంబిక కొరకు, కనక అంశుకాయై = బంగారు అంశుకము ధరించిన కమలాంబిక కొరకు, అంశుకము అనగా వస్త్రము. (అంశూన్ కాయతి, కై శబ్దే) శ్రీసూక్త ప్రారంభంలో చెప్పిన **హిరణ్యవర్ణాం హరిణీం...** అను వర్ణనను ఇది జ్ఞాపకము తీసుకు వస్తున్నది. ప్రకాశమానమయిన వస్త్రము ధరించిన కమలాంబిక కొరకు అని ఇంకొక అర్థం. (కనతి దీప్యతే అసౌ ప్రకాశించునది. బంగారము) కర్పూర వీటికాయై = కర్పూర తాంబూల ముఖియైన కమలాంబికకి, **కర్పూరవీటికామోద సమాకర్షద్దిగంతరా**, (కర్పూరపు తాంబూలముయొక్క పరిమళనము గ్రహించుచున్న దిగంతముల ఆవరణములు గలది.) అని లలితాసహస్రనామము. ఆ కమలాంబిక రజోగుణానికి, క్రియాశీలానికి, జగత్సంహారలక్షణానికి (తాంబూలము పంటి కింద పెట్టుకొని కొరుకుట) నమస్కారమని 'కర్పూర-వీటికాయై' లో కవి భావం. తాంబూలము త్రిపుటీ ఏకత్వానికి సూచకమని పెద్దలు చెబుతారు. ఇంద్రాది దేవతలు త్రిపురాసుర

సంహారము తరువాత అమ్మ దగ్గరకు రాగా ఆ జగజ్జనని తన నోటిలోని కర్పూర వీటికను వారి నోటిలో ఉంచినదట. (సౌందర్యలహరి 65వ శ్లోకం) నమస్తే నమస్తే = ఓ కమలాంబికా! నీకు నమస్కారం. నీకు నమస్కారం. కమలా కాంత అనుజాయై = లక్ష్మీదేవియొక్క భర్తయగు నారాయణుని సహోదరి యగు కమలాంబిక కొరకు, కమలాంబిక విష్ణుమూర్తికి సహోదరి. దేవీ భాగవతం తొమ్మిదవ స్కంధము ప్రకారం సత్వగుణ అండములో విష్ణువు గౌరి అవతరించారు. అందువలన వీరిద్దరు సహోదరులు. కామేశ్వర్యై = కామేశ్వరి కొరకు, కామేశ్వరుని పత్ని కామేశ్వరి. (సంకల్ప శక్తి) కామ కల రూపవిద్యకు అధిష్ఠాన దేవత కామేశ్వరి. అజాయై = అజ కొరకు, న జాయతే ఇతి అజా. (పుట్టనిది) పుంలింగము అజః, స్త్రీ లింగము అజా. హిమగిరి తనుజాయై = హిమగిరితనుజకొరకు, తారకాసుర సంహారము కొరకు కుమారస్వామి అవతరింపవలసి ఉన్నది. అందువలన దేవతలచే ప్రార్థింపబడి కమలాంబిక హిమవంతుని కుమార్తెగా అవతరించినది. హ్రీంకార పూజ్యాయై = హ్రీంకార పూజ్యకొరకు, అమ్మవారి యొక్క త్రిశతీ నామములలో 25వ నామము హ్రీంకారము. (హ్రీంకార పూజ్యాయై) ఈ ఏకాక్షర భువనేశ్వరీ మంత్రమునకు అధిష్ఠాన దేవతయగు భువనేశ్వరి కమలాంబిక అని ఆంతర్యము. **హ్రీంకారాసనగర్భితానలశిఖాం...** అని దేవీఖడ్గమాల. **"హ్రీంకారీ హ్రీమతీ"** అని లలితాసహస్రము. కమలానగరవిహారిణ్యై = కమలానగర విహారిణి కొరకు, కమలానగరమనగా శ్రీచక్రము. లేదా శరీరము. అందులో విహారము చేసేది. ఖల సమూహ సంహారిణ్యై = దుష్టజన సంహారిణి కొరకు, కమనీయ రత్న హారిణ్యై = కమనీయమైన రత్నహారాలు ధరించిన కమలాంబిక కొరకు, కలి కల్మష పరిహారిణ్యై = కలికల్మషపరిహారిణికొరకు, కలియుగంలో ఉన్న పాపములను సంపూర్ణంగా పోగొట్టునది. తనని ఆరాధించడమే కలికల్మషాలు పోవటానికి మార్గమని బ్రహ్మాండ పురాణంలో కాంచీ క్షేత్రంలో అగస్త్యునికి అమ్మవారు హయగ్రీవ స్వామి వారి ద్వారా చెప్పించింది. సకల సౌభాగ్యదాయక అంభోజ చరణాయై = తన చరణపద్మములను ఆశ్రయించిన భక్తులకు సకల సౌభాగ్యములను ప్రసాదించు కమలాంబిక కొరకు, **"శరణ్యే లోకానాం తవ హి చరణావేవ నిపుణౌ"** (పాదకమలములను ఆశ్రయించిన వారికి అన్నిరకాల ఐశ్వర్యాలను, మోక్షాన్ని ప్రసాదించుటలో అమ్మవారు నిపుణురాలు – సౌందర్యలహరి 04వ శ్లోకం), **ప్రాతర్నమామి లలితా చరణారవిందం** (లలితా పంచరత్న స్తోత్రం) అని శంకర భగవత్పాదులు అమ్మవారి చరణముల గొప్పతనాన్ని చెప్పారు. ఆ చరణముల పూజ దేనినయినా అనుగ్రహించగలదు. చరణమనగా చక్రమని విశేషార్థం. (**తవ చరణ కోణాత్** – సౌందర్యలహరి) సౌభాగ్యదాయకచక్రమునందు చరణములనుంచిన

కమలాంబిక కొరకు అని మరొక అర్థం. సకల సౌభాగ్యములనిచ్చు కాంభోజి రాగములోని చరణములు కలిగిన కమలాంబిక కొరకు, అని రాగ నామమును నిర్దేశించిన పదముతో ఇంకొక అర్థము కూడా ఇక్కడ చెప్పుకోవచ్చు. సంక్షోభిణ్యాది శక్తియుత చతుర్థ ఆవరణాయై = సంక్షోభిణీ మొదలైన శక్తులతో కూడిన నాలుగో ఆవరణము కలిగిన కమలాంబిక కొరకు, ఈ ఆవరణములో సంక్షోభిణి మొదలుగా 14గురు శక్తులున్నారు. (సంప్రదాయ యోగినులు లేదా కులయోగినులు). 1. సర్వసంక్షోభిణీ, 2. సర్వవిద్రావిణీ, 3. సర్వాకర్షిణీ, 4. సర్వాహ్లాదినీ, 5. సర్వసమ్మోహినీ, 6. సర్వస్తంభినీ, 7. సర్వజృంభిణీ, 8. సర్వవశంకరీ, 9. సర్వరంజనీ, 10. సర్వోన్మాదినీ, 11. సర్వార్థసాధినీ, 12. సర్వసంపత్తిపూరణీ, 13. సర్వమంత్రమయీ, 14. సర్వద్వంద్వక్షయంకరీ; ప్రకట చతుర్దశ భువన భరణాయై = ప్రకాశించుచున్న చతుర్దశ భువనములు భరించు కమలాంబిక కొరకు, 1. భూలోకం, 2. భువర్లోకం, 3. సువర్లోకం, 4. మహర్లోకం, 5. జనలోకం, 6. తపోలోకం, 7. సత్యలోకం, 8. అతలం, 9. వితలం, 10. సుతలం, 11. తలాతలం, 12. మహాతలం, 13. రసాతలం, 14. పాతాళం ఈ పదునాలుగు భువనములను యీ ఆవరణయందున్న 14 శక్తి దేవతల చేత కమలాంబిక పాలించుచున్నదని తాత్పర్యము. అమ్మవారి రూపధ్యానము చేసిన వారు ఈ చతుర్దశలోక సందర్శనమును ఆమె చిన్మయ ప్రపంచముగా దర్శించగలరని మరొక అర్థం. ప్రబల గురుగుహ సంప్రదాయ అంతఃకరణాయై = ప్రబలమైన గురుగుహ సంప్రదాయాంతఃకరణము కలిగిన కమలాంబిక కొరకు, ప్రబల మనగా అధిక బలము, అనగా శాస్త్ర సమ్మతమైన, పూర్వపక్షము చేయుటకు వీలు కానట్టిది. ఇటువంటి ప్రబలమగు గురువు గుహుడు. (కుమారస్వామి) అతనిచే ఆజ్ఞాపింపబడిన ఆచారము యొక్క పరమ తాత్పర్యంతో ప్రకాశింపబడుచున్న పరదేవత, శబ్దబ్రహ్మము (శాస్త్రజ్ఞానము) పరబ్రహ్మము (అపరోక్షానుభూతి) కలిగిన ప్రబలమగు గురువుల అంతఃకరణమునందు నివసించునది అని మరొక సమన్వయం. అకళంక రూప వర్ణాయై = అకళంకమైన (ఏ విధమయిన మచ్చలేని) రూపవర్ణములు కలిగిన కమలాంబిక కొరకు, **సర్వారుణా, అనవద్యాంగీ** అని అమ్మవారి నామములు. దృగ్గోచర వస్తుజాలంలో కలిగే పరిణామాలు ఆరు విధాలు. అవి : మొదట సూక్ష్మరూపం (**పుట్టుక**), తరువాత స్థూలరూపం (పెరుగుదల/వృద్ధి), మరింతగా పెరగటం (బలపడటం), రూపంలో మార్పు రావడం, క్షీణదశ, నాశం. ఈ షడ్వికారాలు ఏవీ లేని తల్లి కనుక ఆమె అకళంక రూపవర్ణ. అపర్ణాయై = అపర్ణయగు కమలాంబిక కొరకు, న పర్ణాన్యపి భోజనం యస్యాః ఆకులను కూడ ఆహారంగా స్వీకరించనిది అపర్ణా. ఇది ఒక అర్థం. అప–ఋణ–అపర్ణ. ఋణం తీరినవాడు ఏ విధంగా నిశ్చింతగా ఉంటాడో, ఆవిధంగా

తనను నమ్మిన భక్తులకు నిశ్చింత కలిగించునది అని మరొక అర్థం. సుపర్ణాయై = సుపర్ణయగు కమలాంబిక కొరకు, పిపర్తి పూరయతి, పర్ణయతి వృక్షమును పూరించునది, పచ్చగా చేయునది, ఆకు; అని పర్ణ శబ్దానికి సామాన్యమైన అర్థం. కాని ఇక్కడ పర్ణ శబ్దానికి వేద మంత్ర వాఙ్మయమని అర్థం చెప్పుకోవాలి. **ఛంధాంసి యస్య పర్ణాణి యస్తం వేద స వేదవిత్** (భగవద్గీత 15- ) సుపర్ణా అనగా మంచి రెక్కలు కలది. ఒక రెక్క కర్మ. రెండవది జ్ఞానము. రెండు రెక్కలతో పక్షులు ఆకాశంలో తిరిగినట్లుగా సాధకులు కర్మజ్ఞాన మార్గములతో అమ్మవారి సన్నిధికి చేరగలరని సుపర్ణాయై లో కవి హృదయం. సుకర ధృత చాప బాణాయై = చేతులందు బాణ చాపములను ధరించిన కమలాంబిక కొరకు "**ఓం పద్మపాశాంకుశ లసత్కరాబ్జాయై నమః**" అని లలితా అష్టోత్తర శత నామావళిలోని ఒక నామం. ఈ భావనతో తుల్యమగుచున్నది. శోభనకర మనుకోణాయై = శోభనకరమగు **చతుర్దశా చక్రం** గల (14 త్రికోణాలతో కూడిన) కమలాంబిక కొరకు, సకుంకుమాది లేపనాయై = కుంకుమాది లేపనము కల కమలాంబిక కొరకు,

**శ్లో॥ సకుంకుమవిలేపనాం అళికచుంబికస్తూరికాం**
**సమందహసితేక్షణాం సశరచాపపాశాంకుశామ్ ।**
**అశేషజనమోహినీం అరుణమాల్యభూషాంబరాం**
**జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరేదంబికామ్ ॥**

- అను బాలా త్రిపురసుందరి ధ్యానశ్లోకములలో ఈ కుంకుమ విలేపన ప్రసక్తి ఉన్నది. కుంకుమతో కూడిన వస్తువులు అమ్మవారికి ఇష్టమని ఆంతర్యం.

చరాచరాది - కల్పనాయై = చరాచరములను కల్పించిన కమలాంబిక కొరకు, **చరాచరజగన్నాథా** - (లలితాసహస్రనామ స్తోత్రం) కదిలెడి, కదలని ఈ జగత్తుకు నాయకురాలు అమ్మ. దేవతా అనేన జీవేనాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి (ఛాందోగ్యోపనిషత్తు) అని చెప్పినట్లుగా తన ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులతో అమ్మ సర్వకారిణి అగుచున్నది. చికుర-విజి-నీల-ఘనాయై = నీల మేఘములను జయించిన చికురములు కలిగిన కమలాంబిక కొరకు, చిదానంద-పూర్ణ-ఘనాయై = చిదానం పూర్ణఘన యగు కమలాంబిక కొరకు నమస్కారము. దుఃఖములు లేని జ్ఞానానంద సంపూర్ణస్వరూపిణి. '**సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ**" - (తైత్తిరీయ ఉపనిషత్తు) ఈ బ్రహ్మ పదార్థమును దీక్షితుల వారు **చిదానందపూర్ణఘన** అన్నారు.

**తా :** కమలాంబిక కొరకు, బంగారు అంశుకము ధరించిన కమలాంబిక కొరకు,

కర్పూర తాంబూల ముఖియైన కమలాంబికకి, లక్ష్మీదేవియొక్క భర్తయగు నారాయణుని సహోదరియగు కమలాంబిక కొరకు, కామేశ్వరి కొరకు, అజకొరకు, హిమగిరితనుజ కొరకు, హ్రీంకార పూజ్య కొరకు, కమలానగర విహారిణి కొరకు, దుష్టజనసంహారిణి కొరకు, కమనీయమైన రత్నహారాలు ధరించిన కమలాంబిక కొరకు, కలికల్మషపరిహారిణి కొరకు, సకల సౌభాగ్యములనిచ్చు పాదపద్మములుకల కమలాంబిక కొరకు, సకల సౌభాగ్యములనిచ్చు కాంభోజి చరణములు కలిగిన కమలాంబిక కొరకు, సంక్షోభిణీ మొదలైనశక్తులతో కూడిన నాలుగో ఆవరణము కలిగిన కమలాంబిక కొరకు, ప్రకాశించుచున్న చతుర్దశ భువనములు భరించు కమలాంబిక కొరకు, ప్రబలమైన గురుగుహ సంప్రదాయాంతఃకరణము కలిగిన కమలాంబిక కొరకు, అకలంకమైన రూపవర్ణములు కలిగిన కమలాంబిక కొరకు, అపర్ణయగు కమలాంబిక కొరకు, సుపర్ణయగు కమలాంబిక కొరకు, చేతులందు బాణ–చాపములను ధరించిన కమలాంబిక కొరకు, శోభన కరమగు **చతుర్దశారచక్రం** గల కమలాంబిక కొరకు, కుంకుమాది లేపనము కల కమలాంబిక కొరకు, చరాచరములను కల్పించిన కమలాంబిక కొరకు, నీల మేఘములను జయించిన చికురము కలిగిన కమలాంబిక కొరకు, చిదానంద పూర్ణఘన యగు కమలాంబిక కొరకు నమస్కారము.

**వి :** ఈ కీర్తన చతుర్థీవిభక్తిలో ఉన్నది. ఇది నాలుగవ ఆవరణ కీర్తన. దీనికే **సర్వసౌభాగ్యదాయకచక్రమ**ని ఇంకొక పేరు. సర్వసౌభాగ్యదాయక చక్రమును **చతుర్దశారము** అంటారు. దీని వర్ణము దాడిమీ కుసుమ సహోదరము. ఈ చతుర్దశారములోని పదునాలుగు ఒక్కొక్క కోణములలో ఒక్కొక్క దేవత ఉన్నది. వారి పేర్లు వరుసగా సర్వసంక్షోభిణీ మొదలైన వారు. (ప్రతిపదార్థములో ఈ పేర్లు ఉన్నవి). త్రిపురవాసిని ఈ చక్రేశ్వరి. దీనిలోని రసము భయము.

## 6. కమలాంబికాయాః పరం...

**॥ పంచమావరణకీర్తనమ్ ॥ (పంచమీ విభక్తి) ॥**

**రాగం : భైరవి, ఝంప తాళం**

**పల్లవి : శ్రీకమలాంబికాయాః పరం నహి రే రే చిత్త!**
**క్షిత్యాదిశివాంతతత్వస్వరూపిణ్యాః**

**అనుపల్లవి : శ్రీకంఠవిష్ణువిరించాదిజనయిత్ర్యాః**
**శివాత్మకవిశ్వకర్త్ర్యాః కారయిత్ర్యాః**

**శ్రీకరబహిర్దశారచక్రస్థిత్యాః**
**సేవితభైరవీభార్గవీభారత్యాః**

చ : **నాదమయసూక్ష్మరూపసర్వసిద్ధిప్రదాదిదశశక్త్యారాధితమూర్తేః**
**శ్రోత్రాదిదశకరణాత్మకకుళకౌళికాదిబహువిధోపాసితకీర్తేః**
**అభేదనిత్యశుద్ధబుద్ధముక్తసచ్చిదానందమయపరమాద్వైతస్ఫూర్తేః**
**ఆదిమధ్యాంతరహితాప్రమేయగురుగుహమోదితసర్వార్థసాధకపూర్తేః**
**మూలాదినవాధారవ్యావృత్తదశధ్వనిభేదజ్ఞయోగిబృందసురక్షణ్యాః**
**అనాదిమాయాఽవిద్యాకార్యకారణవినోద కరణపటుతరకటాక్షవీక్షణ్యాః.**

ప్ర : శ్రీకమలాంబికాయాః పరమ్ = కమలాంబి కంటె, పరమైనది (అన్యదైవము), న హి = మరియొకటి లేదు. రే రే చిత్త! = ఓ ఓ మానసమా!, క్షిత్యాది-శివాంత-తత్త్వ-స్వరూపిణ్యాః = భూమి మొదలు శివుడు వరకు గల సకల తత్త్వముల స్వరూపిణియగు కమలాంబిక కంటె, **వివరణ :** పై నుంచి వస్తే శివుని నుంచి క్షితి వరకు, క్రింది నుంచి చూస్తే క్షితి నుంచి శివుని వరకు మొత్తం 36 తత్త్వాలు. ఈ 36 తత్త్వాలను మూడు రకాలుగా విభజించారు.

1. **ఆత్మ (జీవుడు అనబడేవాని) తత్త్వములు** ఇవి 24. భూతపంచకము (5), పంచతన్మాత్రలు (5), పంచ కర్మేంద్రియములు (5), పంచ జ్ఞానేంద్రియములు (5), మనస్సు, బుద్ధి, అహంకారము, ప్రకృతి.

2. **విద్యాతత్త్వములు**. ఇవి 7. పురుష, నియతి, కాల, రాగ, అవిద్య, కల, మాయ

3. **శివతత్త్వములు**. ఇవి 5. శుద్ధవిద్య, ఈశ్వర, సదాశివ, శక్తి, శివ.

శ్రీవిద్యలో ఆచమనములో ఈ 36 తత్త్వాలను శుద్ధి చేస్తుంటారు. పనిచేస్తున్న ఈ తత్త్వాల ద్వారా పని చేయిస్తున్న చైతన్యాన్ని మనం గమనించాలని కవి ప్రబోధం.

ఈ 36 తత్త్వములు కలిగిన కమలాంబిక కంటె ఇంకొక అధిక దైవము లేదు.

తత్త్వాతీతస్వరూపిణి ఆమెయే. తత్త్వమయస్వరూప కూడా ఆమెయే. భూమిపై ప్రసరించే కాంతి సూర్యునిదే. భూమికి అతీతంగా వెలుగొందే కాంతి దాత కూడా సూర్యుడే.

శ్రీకంఠ-విష్ణు-విరించాది-జనయిత్ర్యాః = శివ విష్ణు బ్రహ్మలకు తల్లియైన కమలాంబిక కంటె, **వివరణ :** మూలాధార స్వాధిష్ఠాన చక్రములపైన విరించిని (బ్రహ్మ) అనాహత మణిపూరము పైన విష్ణుదేవుని, విశుద్ధి, ఆజ్ఞాచక్రాల పైన శ్రీకంఠుని అనగా శివుని శ్రీమాత నియమించినది కనుక ఆమె వీరికి తల్లిగా చెప్పబడింది. సృష్టి స్థితి

లయములకు మూలకారణము పరాశక్తి. పరాశక్తి ఆకృతులు త్రిమూర్తులు. మూలకారణాన్ని ఇక్కడ దీక్షితుల వారు జనని అన్నారు.

శివాత్మక–విశ్వ–కర్త్ర్యాః = శివాత్మకమయిన విశ్వమును సృష్టించిన కమలాంబిక కంటె, కుండ తయారు కావటానికి మట్టి, చేసేవాడు కావాలి. (నిమిత్త, ఉపాదాన కారణాలు) అమ్మవారు కూడా కర్త, మరియు కారయిత.

ఉపనిషత్తుల్లో చెప్పిన విశ్వానికి కారణమయిన వేద అను విచారణకు అద్భుతమయిన పీఠికను దీక్షితుల వారు ఇక్కడ ప్రతిపాదించారు.

కారయిత్ర్యాః = కారయిత్రి అయిన కమలాంబిక కంటె, **వివరణ :** బ్రహ్మ, విష్ణువు, శివుడు శ్రీకమలాంబికను ధ్యానం చేస్తూ తమకు విహిత కృత్యములైన సృష్టి, స్థితి, లయములను చేస్తారు. తాను కర్తయై వీరిచేత సృష్ట్యాదులు చేయిస్తుంది కనుక అమ్మ కారయిత్రి.

శ్రీకర–బహిర్దశార–చక్ర–స్థిత్యాః = శ్రీకరమైన అయిదవ ఆవరణమగు బహిర్దశార చక్రములో కొలువై యున్న కమలాంబిక కంటె, **వివరణ :** శ్రీచక్రంలో అయిదవ ఆవరణకు **బహిర్దశారము** అని పేరు దశారము అంటే పది కోణాలు. వెలుపలగా ఉన్న పది కోణాల చక్రం బహిర్దశారము. లోపలగా ఉన్న పది కోణాల చక్రం సర్వార్థసాధక చక్రం. (అంతర్దశారము) ఈ బహిర్దశార చక్రములో కమలాంబిక కొలువై యున్నదని ఆమెకంటె గొప్పదేవత ఇంకొకరు లేరని దీక్షితులవారు మనకు ప్రబోధిస్తున్నారు.

సేవిత–భైరవీ–భార్గవీ–భారత్యాః = భైరవీ, భార్గవీ, భారతుల చేత సేవింపబడుచున్న కమలాంబిక కంటె, **వివరణ :** శివుడు, విష్ణువు, బ్రహ్మ, శ్రీకమలాంబిక సేవ చేస్తుంటారు. వారి శక్తులు పార్వతి, లక్ష్మి, సరస్వతులు. కనుక వారి వారి పత్నులయిన పార్వతి, లక్ష్మి, సరస్వతులు కూడా అమ్మను కొలుస్తుంటారు. “శ్రీకంఠ–విష్ణు–విరించాది” అను వరుసకు అనుగుణంగా భైరవీ, భార్గవీ, భారతుల పేర్లు చెప్పబడుట గమనార్హం.

ఈ కీర్తనకు సంబంధించిన భైరవి రాగం పేరు ఈ పాదములో నిక్షిప్తమైనది.

**శ్లో॥ శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్**
**న చే దేవం దేవో న ఖలు కుశలః స్పన్దితుమపి ।**
**అతస్త్వా మారాధ్యాం హరిహరవిరిఞ్చాదిభిరపి**
**ప్రణన్తుం స్తోతుం వా కథమకృతపుణ్యః ప్రభవతి ॥** – (సౌందర్యలహరి)

(సర్వమంగళస్వరూపుడైన పరమశివుడు పరాశక్తి అయిన నీతో (అనగా అమ్మవారితో) కలిసి ఉన్నప్పుడు మాత్రమే ఈ సృష్టి నిర్మాణము చేయడానికి సమర్థుడు. నీతో కలిసి లేకపోతే కనీసం కదలడానికి కూడా అశక్తుడు. త్రిమూర్తుల చేత మరియు వేదములచేత కూడా పూజింపబడే నీకు నమస్కారం చేయాలన్నా, స్తుతిచేయాలన్నా పూర్వ జన్మలలో చేసుకున్న పుణ్యబలం ఉంటేనే సాధ్యం) ఈ శ్లోకంలో పై దీక్షితుల వారి అభిప్రాయం దృఢ పరచబడినది. శివాదులు, శివ శక్తులు అమ్మవారి సేవకులు. **ఓం వాణీ గాయత్రీ సావిత్రీ సన్నుతాయై నమః** అని లలిత అష్టోత్తర శత నామావళి.

నాద-మయ-సూక్ష్మ-రూప-సర్వసిద్ధిప్రదాది-దశ-శక్త్యారాధిత-మూర్తేః = నాదమయమైన సూక్ష్మరూపంలో ధరించియున్న సర్వసిద్ధిప్రదా మొదలగు పదిశక్తులచేత ఆరాధింపబడిన మూర్తియగు కమలాంబిక కంటె, **వివరణ :** పరాశక్తి నాదమయమైన సూక్ష్మరూపము కలిగి 1. సర్వసిద్ధిప్రదే, 2. సర్వసంప్రత్ప్రదే, 3. సర్వప్రియంకరి, 4. సర్వమంగళకారిణి, 5. సర్వ కామప్రదే, 6. సర్వదుఃఖవిమోచిని, 7. సర్వమృత్యుప్రశమని, 8. సర్వవిఘ్ననివారిణి, 9. సర్వాంగసుందరి, 10. సర్వసౌభాగ్యదాయిని అను దశ శక్తులచే ఆరాధింపబడిన మూర్తి కమలాంబిక. ఈ దశశక్తులు సూక్ష్మమయ నాద స్వరూపము కలిగినవి.

నవాధారములైన నవచక్రములలో జలధి (సముద్రము), జీమూత (మేఘము), భేరి (భేరీ వాద్యము), మర్దళ (మృదంగము), శంఖ (శంఖము), ఘంటా (ఘంటా), కాహళ (గజ్జలు), వంశీ (వేణువు), వీణా (వీణ), భ్రమర (తుమ్మెదల) అను దశ ధ్వనుల నాదాన్ని ఒకానొక స్థితిలో ఆజ్ఞాచక్రమును దాటిన తరువాత యోగులు వింటారు. ఇదే నాదమయమైన సూక్ష్మరూపం. శబ్దబ్రహ్మోపాసన విద్య. "**నారాయణీ నాదరూపా నామరూపవివర్జితా**" అని లలితాసహస్రనామము.

శ్రోత్రాది-దశ-కరణ-ఆత్మక-కుళ-కౌళికాది-బహువిధ-ఉపాసిత-కీర్తేః = చెవి మొదలుకొని - అనగా జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ధర్మములు ధరించిన వారి చేత, కులోత్తీర్ణ యోగినీ మూర్తుల చేత, షట్చక్రములు తెలుసుకొంటూ ఆ మార్గములో చెప్పబడిన సంప్రదాయములను పాటిస్తున్న ఉపాసకుల చేత బహువిధములుగా ఉపాసింపబడిన కీర్తిగల కమలాంబిక కంటె, **వివరణ :** జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము మొత్తము పది. ఇవి దశకరణాలు. ఈ దశేంద్రియములచే బహువిధములుగా ఉపాసింపబడుచు ముక్తిస్వరూపిణిగా నున్న కమలాంబిక కంటే ఇంకొక పరదైవము లేదని కవి అభిప్రాయం. **షట్చక్రములకుకులమ**ని పేరు. కులమార్గంలో చేసే ఆరాధన **కౌళిక**. **కులాంతఃస్థాయై నమః** అని లలితాసహస్రం.

అభేద-నిత్య-శుద్ధ-బుద్ధ-ముక్త-సచ్చిదానంద-మయ-పరమ-అద్వైత-స్ఫూర్తేః = అభేద నిత్య శుద్ధ బుద్ధముక్త సచ్చిదానంద పరమాద్వైతస్ఫూర్తియగు కమలాంబిక కంటె, **వివరణ :** ఆత్మ అంటే నేను. ఆత్మీయమంటే నాది. అహం, మమలని వీటికే మారుపేర్లు. అఖండమైన ఆత్మచైతన్యంలో ఏర్పడిన విభాగమిది. స్వతహాగా అది అఖండమైనా మన అవిద్య మూలంగా ఖండమై కనిపిస్తున్నది. మొదటిది చిదాభాసుడైన జీవుడైతే రెండవది సదాభాసమైన జగత్తు. మరలా విద్య ఉదయిస్తే ఆభాసలు రెండూ లయమై సచ్చిత్సామాన్యమైన అఖండాత్మగా దర్శనమిస్తుంది.

అద్వైతంలో ఈశ్వర సాక్షాత్కారమనే మాటకు అర్థం లేదు. ఆత్మచైతన్యానికి భిన్నంగా జగత్తు ఎలా లేదో అలాగే ఈశ్వరుడు కూడా లేడు. ఈశ్వరుడంటే అఖండ చైతన్యమే. కనుక అది ఆత్మగానే అనుభవానికి రావాలి. అప్పటికి ఆత్మసాక్షాత్కారమంటే సమస్తమూ సత్య, జ్ఞాన, ఆత్మకంగా దర్శన మివ్వటమే. ఈ స్ఫూర్తిని కలిగించేది జగజ్జనని.

ఆది-మధ్య-అంత-రహిత-అప్రమేయ-గురుగుహ-మోదిత- సర్వార్థసాధక-పూర్తేః = ఆది మధ్యాంతర రహిత అప్రమేయమై సద్గురువగు గుహునిచే (సుబ్రహ్మణ్యస్వామి) ఆమోదింపబడిన సర్వార్థసాధక పూర్తియగు (ఏ కోరిక లేని పరిపూర్ణ విద్యాదాయిని) యగు కమలాంబిక కంటె, **వివరణ :** గురు గుహ అనగా మహా గురువులని ఇంకొక అర్థం. గురువులు గుహా విద్య ద్వారా - అనగా దహరాకాశంలో అంతర్ముఖమయి సర్వార్థసాధక స్థితిని తెలుసుకొంటాడు. దహర చిన్నది. అల్పమైనది. దహరాకాశం అంటే స్వల్పమైన ఖాళీ. అది హృదయంలో ఉంది. ఆ మేరకే పరిమితమై కనిపిస్తుంది మన జ్ఞానం కానీ అది ఆ మేరకే లేదు. ఆకాశం లాగా సర్వత్రా వ్యాపించి ఉంది. హృదయం కేవలం దానికొక ఉపాధి. ఈ ఉపాధిలో అది వ్యక్తమై కనిపిస్తుంది. దీనిని బట్టి దాని మహత్త్వాన్ని మనం గ్రహించవచ్చు. ఇది దహరాకాశ మయితే అది మహాకాశం లాంటిది. దహరానికి మరోపేరు దభ్రం.

మూలాది-నవాధార-వ్యావృత్త-దశ-ధ్వని-భేదజ్ఞ-యోగిబృంద- సంరక్షణ్యాః = మూలాధారాదినవాధారములందు వినిపించు పదివిధములైన ధ్వనులను భేదించు యోగిబృందమును సంరక్షించు కమలాంబిక కంటె, అనాది-మాయా-అవిద్యా-కార్య-కారణ-వినోద-కరణ-పటుతర-కటాక్ష-వీక్షణ్యాః = అనాది యగు అవిద్యా కార్యకారణ వినోదములను కలిగింపజాలు కటాక్షవీక్షణములను ప్రసాదించు కమలాంబిక కంటె, (పరమైనది మరియొకటి లేదు). **వివరణ :** మాయ అనాది. అది ఎప్పటినుంచి ఉన్నదో చెప్పటానికి వీలులేనిది. అది అజ్ఞానం లేదా అవిద్య. మా అంటే లేదు, కాదు

అనీ, 'యా' అంటే 'ఏదీ' అనీ అర్థం చెప్పుకుని ఏది లేదో, ఏది కాదో అది అని ఒక వివరణ, "**యా న విద్యతే వస్తుతః సా మాయా**" వాస్తవంగా ఏది లేదో అది ఉన్నట్లు తోచడం మాయ. ఈశ్వరుడి దగ్గర నియంత్రణలో ఉంటే అది మాయ. జీవుడిని ఆవహిస్తే అది అవిద్య అని ఒక సమన్వయం. కారణము : కారణము అనగా ఒక కార్యమేర్పడటానికి ముందున్న పదార్థం.

ఉపాదానమని, నిమిత్తమని, సహకారి అని మూడు విధాలు ఇది. మట్టిలాగా అచేతనమైనది **ఉపాదానం**, కుమ్మరిలాగా చేతనమైనది **నిమిత్తం**. సారెలాగా తోడ్పడేది **సహకారి**. మూడు కలిస్తేగాని కార్యమనేది ఏర్పడదు. ఇవి మూడూ ద్వైతులకు వేరు వేరు. మూడు కలిసి ఒక్కటే అద్వైతులకు. పరమాత్మే ప్రపంచమనే కార్యానికి ఉపాదానం. ఆయనే నిమిత్తం. ఆయనే సహకారి. జ్ఞానం ద్వారా నిమిత్తం. శక్తిద్వారా ఉపాదానం. సంకల్పం ద్వారా సహకారి. అవిద్యా రూపమైన కారణ శరీరమని కూడా దానికి మరొక అర్థం. కార్యము : కారణం ద్వారా ఏర్పడే ఫలం. కారణం పూర్వమైతే కార్యం ఉత్తరం. లేదా అపరం.

కార్యకారణసంబంధమే సృష్టి అంతా. హేతుఫలాలని కూడా వర్ణిస్తారు వీటిని. వీటి సంబంధం అవినాభావి, కారణం లేని కార్యం లేదు. కార్యంలేని కారణం లేదు. రెండూ అన్యమని చూస్తే సంసారం. ఏకమని చూస్తే సాయుజ్యం. ఏకమంటే కారణాన్ని కార్యంగా కాదు, కార్యాన్ని కారణంగా, ఇదే **అద్వైతభావం**.

**వినోదము** అనగా కార్యకారణాల వల్ల ఏర్పడిన మాయారూపమైన విలాసము. అమ్మవారి అనుగ్రహంతో ఇది తొలగిపోతుందని దీక్షితుల వారు ఈ పాదంలో చెబుతున్నారు.

**తా :** మానసమా! శివుడు మొదలు పృథివి వరకు గల ముప్పదియారు తత్త్వముల స్వరూపిణి యగు కమలాంబిక కంటె, శివ విష్ణు బ్రహ్మలకు తల్లియైన కమలాంబిక కంటె, కారయిత్రి అయిన కమలాంబిక కంటె, శ్రీకరమైన అయిదవ ఆవరణమగు బహిర్దశార చక్రమునందు వేంచేసి యున్న కమలాంబిక కంటె, భైరవీ, భార్గవీ, భారతుల చేత సేవింపబడుచున్న కమలాంబిక కంటె, నాదమయమైన సూక్ష్మరూపంలో ధరించియున్న సర్వసిద్ధిప్రదా మొదలగు పదిశక్తులచేత ఆరాధింపబడిన మూర్తియగు కమలాంబిక కంటె, జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ధర్మములు ధరించిన యోగినీ మూర్తిచేత బహువిధములుగా ఉపాసింపబడిన కీర్తిగల కమలాంబిక కంటె, అభేద నిత్యశుద్ధబుద్ధముక్త సచ్చిదానంద పరమాద్వైతస్ఫూర్తియగు కమలాంబిక కంటె, ఆదిమధ్యాంతరహిత

అప్రమేయమై సద్గురు వగు గుహుని చే ఆమోదింపబడిన సర్వార్థసాధక పూర్తియగు శ్రీదేవి కంటె మూలాధారాది నవాధారములందు వినిపించు పది విధములైన ధ్వనులను భేదించు యోగిబృందమును సంరక్షించు కమలాంబిక కంటె, అనాదియగు అవిద్యా కార్యకారణవినోదములను కలిగింప జాలు కటాక్షవీక్షణములను ప్రసాదించు కమలాంబిక కంటె, పరమైనది మరియొకటి లేదు.

**వి :** ఇది అయిదవ ఆవరణ కీర్తన. ఇది పంచమీవిభక్తి యందున్నది.

అయిదవ ఆవరణమునకు **బహిర్దశారమ**ని పేరు. ఇది **దశకోణాకృతి** కలది. ఇది **సర్వార్థచక్రం**. ఏకార ప్రకృతి కలది. దశావతారాత్మకమైనది. ఇచట పదిమంది దేవతలు ఉన్నారు. వారు **సర్వసిద్ధిప్రదే, సర్వసంపదే, సర్వప్రియంకరి, సర్వమంగళకారి, సర్వకామప్రదే, సర్వదుఃఖవిమోచని, సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్ననివారిణి, సర్వాంగ సుందరి, సర్వసౌభాగ్యదాయిని** అనువారలు. ఈ దేవతలు **కులోత్తీర్ణయోగినులు**. ఈ చక్రమునకు అధిష్ఠాత్రి **త్రిపురా**. ఈ చక్రమున బీభత్సరసము.

**అమ్మకంటె గొప్ప దేవుడు లేదు అని ఈ కీర్తనలో ఉన్నది. ఇంకొక గ్రంథంలో శివునికంటె గొప్ప దేవుడు లేదు.. మరొక గ్రంథంలో విష్ణువు కంటె గొప్పదేవుడు లేదు అని వర్ణనలు ఉంటాయి. ఇక్కడ అయోమయం పనికిరాదు. అన్నింటిని మించిన పరతత్త్వము ఒక్కటే. దానికి అమ్మవారు అని పేరు పెట్టుకొంటే మిగతా అందరూ సేవకులు. శివుడు అని పేరు పెట్టుకంటే మిగతా అందరూ సేవకులు. విష్ణువు అని పేరు పెట్టుకంటే మిగతా అందరూ సేవకలు. ఈ సత్యం గ్రహిస్తే అయోమయం తొలగిపోతుంది.** స్వస్తి.

---

## 7. కమలాంబికాయాస్తవ

**॥ షష్ఠ్యావరణకీర్తనమ్ ॥ (షష్ఠీవిభక్తి) ॥**

**రాగం : పున్నాగరవళి, రూపక తాళం**

**పల్లవి :** కమలాంబికాయాస్తవ భక్తోఽహం
శంకర్యాః శ్రీకర్యాః సంగీతరసికాయాః

**అనుపల్లవి :** సుమశరేక్షుకోదండపాశాంకుశపాణ్యాః
అతిమధురతరవాణ్యాః శర్వాణ్యాః కల్యాణ్యాః
రమణీయపున్నాగవరాళివిజితవేణ్యా

**చ : దశకలాత్మకవహ్నిస్వరూపప్రకాశాంతర్దశారసర్వరక్షాకరచక్రేశ్వర్యాః**
**త్రి-దశాదినుత క-చ-వర్గద్వయమయసర్వజ్ఞాది -**
**త్రి-దశవింశద్వర్ణగర్భిణీకుండలిన్యాః**
**దశముద్రాసమారాధితకౌళిన్యాః**
**దశరథాదినుతగురుగుహజనకశివబోధిన్యాః**
**దశకరణావృత్తిమరీచినిగర్భయోగిన్యాః**

**ప్ర :** కమలాంబికాయాః = కమలాంబికయొక్క, తవ = (ఓ కమలాంబికా!) నీ యొక్క, భక్తః = భక్తుడను, అహం =నేను, శంకర్యాః = శంకరియైనటువంటి, **వివరణ :** శం సుఖం కల్యాణం కరోతి, కల్యాణము కూర్చువాడు శివుడు. అతని భార్య కనుక కమలాంబిక శంకరి. కరః అనగా చేయునది. "సృష్టి, స్థితి, లయములందు ఎట్టి భయములేని శంభువును నేను స్త్రీరూపములో దక్షుని పుత్రికగా జన్మిస్తాను. అప్పుడు దేవతలు నన్ను విష్ణుమాయ, జగన్మయి, శాంకరి, రుద్రాణి అని కీర్తిస్తారు" అని శివుడు చెప్పాడు. కనుక శంకరి, శివులొకటే.

శ్రీకర్యాః = శ్రీకరియయినటువంటి, **వివరణ :** శ్రియః కరీ = శ్రేయస్సును ఇచ్చునది. ప్రియమైనది ప్రేయస్సు. హితమైనది శ్రేయస్సు. ఒకటి ధర్మపురుషార్థం. మరొకటి బ్రహ్మ పురుషార్థం. జీవిత పరమార్థమైన మోక్షమే శ్రేయస్సు. నిశ్రేయసమని కూడా దీన్ని పేర్కొంటారు. ఇది జ్ఞానం వల్లనే సిద్ధిస్తుంది. అలా కాక అజ్ఞానమింకా వదలక అర్థకామాలే లేదా అభ్యుదయదాయకమైన ధర్మమే గమ్యమని భావిస్తే అదికూడా ప్రేయస్సు క్రిందికే వస్తుంది. "**శ్రీకరీ**" అని లలితాసహస్రనామావళి. లక్ష్ములను (1. ధనలక్ష్మి, 2. ధాన్యలక్ష్మి, 3. ధైర్యలక్ష్మి, 4. రాజ్యలక్ష్మి, 5. జయలక్ష్మి, 6. జ్ఞానలక్ష్మి, 7. సంతానలక్ష్మి, 8. శౌర్య(వీర)లక్ష్మి) చేయునది శ్రీకరి. విష్ణువునకు "శ్రీధరః శ్రీకరః శ్రీమాన్" అని విష్ణుసహస్రనామాలు. అమ్మవారి యొక్క ఈ నామం విష్ణుసంబంధితమైనది.

సంగీత-రసికాయాః = సంగీతమందు ఇష్టం కలది, సంగీతమనగా సమ్యక్ గీతః (మంచి గీతము; నృత్యము - వాయిద్యము; పాడుట) రసికా అనగా రసికురాలు (రసః అస్తి అస్యాః రసము కలది) సంగీతమందు ఇష్టం కలది అని భావార్థం.

నాదరూపిణి, అక్షరస్వరూపిణి అయిన అమ్మవారు సంగీత రసికురాలు. నారాయణీ నాదరూపా... అని లలితాసహస్రము. శ్యామలాదండకములోని "**హే సంగీతరసికే**" అను సంబోధన ఇక్కడ స్మరణీయము. అమ్మవారికి సంగీతమంటే ఇష్టం. అందుకే వీణపట్టుకుని ఉంటారు.

సుమశరేక్షుకోదండపాశాంకుశపాణ్యాః = కమలాంబిక పంచ పుష్ప బాణాలను, చెరకు విల్లును, పాశమును, అంకుశమును ధరించినదని భావం.

**"సకుంకుమవిలేపనామళికచుంబికస్తూరికాం**
**సమందహసితేక్షణాం సశరచాపపాశాంకుశామ్ ।**
**అశేషజనమోహినీమరుణమాల్యభూషోజ్జ్వలాం**
**జపాకుసుమభాసురాం జపవిధౌ స్మరేదంబికామ్ ॥"**

అను శ్లోకము దీక్షితుల వారి ఈ పాదమును చదివిన వెంటనే జ్ఞప్తికి వచ్చును.

"మనోరూపేక్షుకోదండా, పంచతన్మాత్రసాయకా, రాగస్వరూపాశాఢ్యా, క్రోధాకారాం-కుశోజ్వలా" (లలితాసహస్రనామములు) కమలము, తెల్లకలువ, నల్లకలువ, ఎఱ్ఱకలువ, మామిడిపువ్వు అమ్మవారి యొక్క **పంచపుష్పబాణములు** – శబ్దస్పర్శరూప రసగంధములను పంచభూతముల ధర్మములు (పంచతన్మాత్రలు) ఈ అయిదు పుష్పబాణములకు సంబంధించినవి. ఈ పంచతన్మాత్రలు వరుసగా మదన, ఉన్మాదన, మోహన, దీపన, శోషణ కృత్యములను కలిగిస్తాయి.

అమ్మవారి చెఱకు విల్లు సంకల్పవికల్పాత్మకమై క్రియారూపమైన మనస్సు.

రాగమనగా ప్రేమ, అనురాగము, మనోవ్యాపార విశేషము. కోరిక, ఆశ అని రకరకాల అర్థాలు ఈ రాగస్వరూపమైనది అమ్మవారి చేతిలోని పాశము.

క్రోధకరమయినది అంకుశము. ఇది భక్తులకు జ్ఞానరూపంగా, దుష్టులకు క్రోధంగా కనబడుతుంది. మొత్తము మీద అమ్మవారి మనస్సు చెఱకు విల్లు. కోరిక పాశము, ద్వేషమే అంకుశము. పంచతన్మాత్రలు పుష్పబాణములు"

అతి–మధురతర–వాణ్యాః = అతి మధురమైన వచస్సు కలిగినటువంటి, వివరణ : అమ్మవారి మోము వాగ్భవ కూటము. కనుక మధురాతి మధురము.

శర్వాణ్యాః కల్యాణ్యాః = శివుని భార్యయగు నట్టి కల్యాణి (మంగళకరములైన శబ్దములు కలది, శుభదాయిని) యగునట్టి,

రమణీయ–పున్నాగ–వరాళి–విజిత–వేణ్యాః = రమణీయమైన పున్నాగమును (సర్పవిశేషమును) వరాళీ (అలి విజిత = తుమ్మెదల సమూహమును) జయించిన జడ కలిగినటువంటి, **వివరణ :** రాగ నామము పున్నాగ వరాళిని ఇక్కడ కవి సంకేతించారు.

**శ్లో॥ నీల నాగాఽభయా వేణ్యా జఘనం గతయైకయా ।**
**నీలయా నీరాదాపాయే వన రాజ్యా మహీమివ ॥** (సుందర 15వ సర్గ 25వ శ్లో.)

అని వాల్మీకి సీతమ్మ జడను వర్ణించారు. ఆమె కేశపాశము నల్లత్రాచువలె, కటి ప్రదేశం వరకు వేలాడుతున్నది. అప్పుడామె శరత్కాలంలోని నల్లని వృక్షపంక్తితో కూడిన భూమిలా ఉంది.

**ధునోతు ధ్వాంతం నస్తులితదలితేందీవరవనం** (సౌందర్యలహరి) మనలను ఆవరించిన చీకట్లను అమ్మవారి నల్లని కురులు పోగొట్టాలని శంకరభగవత్పాదుల అమోఘ వర్ణన. (**చంపకాశోక పున్నాగసౌగంధికలసత్కచా** : సంపంగి, అశోక, పున్నాగ, చెంగల్వ పుష్పములచేత ప్రకాశించుచున్న శిరోజసంపద కలిగినది అని లలితాసహస్రం.)

దశ–కలా–ఆత్మక–వహ్ని–స్వరూప–ప్రకాశ–**అంతర్దశార**–సర్వరక్షాకర– చక్రేశ్వర్యాః = దశకలాత్మకమై వహ్ని స్వరూప ప్రకాశమైయున్న అంతర్దశార నామక సర్వరక్షాకర చక్రేశ్వరి యైనటువంటి, **వివరణ :** దశకలాత్మక వహ్ని స్వరూప ప్రకాశ అంతర్దశా సర్వరక్షాకర చక్రేశ్వరి ఆరవ ఆవరణము అంతర్దశారము. దీని తత్త్వము అగ్ని. అగ్నికి పది కళలు. ఈ ఆవరణ దేవతలు పది మంది. అగ్నియొక్క పదికళలును యీ పది ఆవరణ దేవతలుగా ప్రకాశించుచున్నవని భావము. (అగ్నికళలు : **ధూమ్రా, ఊష్మా, జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగినీ, సుశ్రీ, సురూపా, కపిలా, హవ్యవాహినీ, కవ్యవాహినీ**) ఈ అంతర్దశార చక్రమునకు సర్వరక్షాకర చక్రమని పేరు. ఈ చక్రేశ్వరి త్రిపురమాలిని.

త్రిదశాది–నుత క–చ–వర్గ–ద్వయ–మయ–సర్వజ్ఞాది–దశ–శక్తి–సమేత–మాలినీ–చక్రేశ్వర్యాః = దేవతలచేత వినుతింపబడిన కచ వర్గద్వయరూపదశశక్తిసమేత మాలినీ చక్రేశ్వరి యగునట్టి, **వివరణ :** ఈ ఆరవ ఆవరణ అధిష్ఠానదేవత త్రిపుర మాలిని. ఆమె **సర్వజ్ఞే, సర్వశక్తే, సర్వైశ్వర్యప్రదే, సర్వజ్ఞానమయి, సర్వవ్యాధిప్రశమశ్రీతీ, సర్వాధారస్వరూపే, సర్వపాపహరే, సర్వానందమయి, సర్వరక్షాస్వరూపిణి, సర్వేప్సితఫలప్రదే** అను దశశక్తులతో (గర్భయోగినులు) కూడినది. వారు క, చ, అను రెండు వర్గాక్షరములతో పూజింపబడుతున్నారు. (**కఖగఘఙ చఛజఝఞ**) ఈ దేవతలు దేవతలచేత వినుతింపబడిన వారు.

త్రిదశ–వింశద్–వర్ణ–గర్భిణీ–కుండలిన్యాః = పంచాశద్వర్ణగర్భిణీకుండలినియగు నట్టి, (లోపల దాచుకొన్న కుండలినీ శక్తి అయిన అమ్మవారు), **వివరణ :** అంతర చక్రములయిన మూలాధారాది సహస్రాంతమున వర్ణమాల యొక్క పంచాశత్తు (30+20 = 50) వర్ణములున్నవి. ఈ అంతర చక్ర గర్భముననే కుండలినీ సంచారము.

దశ–ముద్రా–సమారాధిత–కౌళిన్యాః = దశముద్రా దేవతల చేత ఆరాధింపబడిన కౌళిని యగునట్టి, శ్రీవిద్యయందు ముఖ్యమైనవి పదిముద్రలు. అవి సర్వసంక్షోభిణి,

సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశ, సర్వఖేచరి, సర్వబీజ, సర్వయోని, సర్వత్రిఖండ ఈ పదిమంది ముద్రాదేవతల చేత ఆరాధింపబడునట్టి పరదేవత, కౌళిని అనగా కుల (షట్చక్ర) సంబంధ పరాశక్తి.

దశరథాది–నుత–గురుగుహ–జనక–శివ–బోధిన్యాః = దశరథాదులచే వినుతింపబడి సద్గురువగు గుహును (సుబ్రహ్మణ్య) తండ్రియగు శివునియొక్క తత్త్వమును బోధించునట్టి, దశరథుడు అమ్మవారిని కొలిచినట్లుగా ప్రసిద్ధి. కామాక్షి మందిరంలో ఇప్పటికీ దశరథారాధిత స్తంభాన్ని (సంతానకారక స్తంభం) చూపుతారు.

రథము శరీరము. ఈ రథము పది ఇంద్రియాలతో నడుస్తుంది. కనుక మనము దశరథులము. బాల్యాది దశలతో కూడిన రథము కనుక ఇది దశరథము. శివబోధిని అనగా శివజ్ఞానప్రదాయిని : శివస్వరూపమును తెలుపునది. శివజ్ఞానము బ్రహ్మజ్ఞానము అనగా స్వస్వరూపజ్ఞానమును కలుగుచున్నందున అట్టి బ్రహ్మజ్ఞానము నిచ్చునది శివబోధిని.

దశ–కరణ–వృత్తి–మరీచి–నిగర్భ–యోగిన్యాః = జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల వృత్తి మరీచులగు (కిరణములగు) గర్భయోగినులను దేవతాస్వరూపిణియగునట్టి, **వివరణ :** ఈ ఆవరణ దేవతలు గర్భయోగినులని ముందు చెప్పబడినది. శ్రీదేవి యొక్క కర్మేంద్రియ జ్ఞానేంద్రియ (పది) వృత్తులు ఆవరణ దేవతారూపములతో నిండిన వనియు చెప్పబడినది. అది మరల అనుసంధితము.

**తా :** శంకరియొక్క, శ్రీకరి యొక్క, సంగీతరసికయొక్క, పూలబాణములను చెఱకు కోదండమును పాశాంకుశములను చేతులందు ధరించిన దేవియొక్క, అతి మధురమైన వచస్సు కలిగినట్టి దేవియొక్క, శివుని భార్యయగునట్టి కల్యాణి యగు దేవియొక్క, పున్నాగవరాళి (తుమ్మెదలసమూహమును) జయించిన రమణీయమైన వేణి కలిగిన దేవియొక్క, దశకలాత్మకమై వహ్ని స్వరూప ప్రకాశమైయున్న అంతర్దశార నామక సర్వరక్షాకర చక్రేశ్వరియైన దేవియొక్క, దేవతలచేత వినుతింపబడిన కచవర్గద్వయ రూపదశశక్తిసమేత మాలినీచక్రేశ్వరి యగు దేవి యొక్క, పంచాశద్వర్ణ గర్భిణీకుండలిని యగు దేవి యొక్క, దశముద్రా దేవతలచేత ఆరాధింపబడిన కౌళినీయగు దేవి యొక్క దశరథాదులచే వినుతింపబడి సద్గురువగు గుహుని తండ్రియగు శివునియొక్క, తత్త్వమును బోధించు దేవియొక్క, జ్ఞానేంద్రియ కర్మేంద్రియముల వృత్తి మరీచులయిన గర్భ యోగినలును దేవతాస్వరూపిణియగు దేవి యొక్క – ఈ రూపాల సమాహారమైన కమలాంబిక యొక్క భక్తుడను నేను.



## 8. శ్రీకమలాంబికాయాం

॥ సప్తమావరణకీర్తనమ్ ॥ (సప్తమీవిభక్తి) ॥

రాగం : శహనా, త్రిపుట తాళం

**పల్లవి : శ్రీకమలాంబికాయాం భక్తిం కరోమి**
**శ్రితకల్పవాటికాయాం చండికాయాం జగదంబికాయాం**

**అనుపల్లవి : రాకాచంద్రవదనాయాం రాజీవనయనాయాం**
**పాకారినుతచరణాయాం ఆకాశాదికిరాణాయాం**
**హ్రీంకారవిపినహరిణ్యాం హ్రీంకారసుశరీరిణ్యాం**
**హ్రీంకారతరుమంజర్యాం హ్రీంకారేశ్వర్యాం గౌర్యాం**

**చరణమ్ : శరీరత్రయవిలక్షణసుఖతరస్వాత్మానుభోగిన్యాం**
**విరించిహరీశానహరిహయవేదితరహస్యయోగిన్యాం**
**వరాదివాగ్దేవతారూపవశిన్యాదివిభాగిన్యాం**
**చరాత్మక సర్వరోగహరనిరామయరాజయోగిన్యాం**
**కరధృతవీణావాదిన్యాం కమలానగరవినోదిన్యాం**
**సురవరమునిజనమోదిన్యాం గురుగుహవరప్రసాదిన్యాం**

**ప్ర :** శ్రీకమలాంబికాయం భక్తిం కరోమి = కమలాంబయందు నేను భక్తి చేయుచుంటిని, శ్రిత కల్ప వాటికాయామ్ = ఆశ్రితజనులకు కల్పవృక్షము వంటిది కమలాంబ, **వివరణ :** సకల భోగభాగ్య మోక్షములు ఇస్తుందని భావం. అమ్మవారు ఉన్నచోట ప్రధానంగా అయిదు కల్పవృక్ష వనాలున్నాయి. (మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము) ఈ అయిదు కల్పవృక్షవనాల తరువాత కదంబవనము. అయిదు ఆవరణలలోను అయిదు కల్పవృక్షాలున్నాయి. కల్పవాటికలతో కూడిన శ్రీపురంలో ఉన్నది. కనుక అమ్మవారిని 'శ్రితకల్పవాటికా' అని కవి నుతించాడు.

చండికాయామ్ = చండికయు, **వివరణ :** చండికా శ్రీకమలాంబికయే చండిక. (కోపన స్త్రీ) దుష్టులైన వారిని చెండాడుటలో నేర్పు కలిగిన కరము కలిగినది చండిక. శ్రీదేవి చండికారూపమున బహు రాక్షస సంహారమొనర్చుట ప్రసిద్ధము. చండికా యనగా దుర్గాదేవి. 'చండీసప్తశతీ' ముఖ్యమైన గ్రంథరాజము. లలితాదేవియే దుష్టసంహారము చేసినప్పుడు చండిక.

జగదంబికాయామ్ = జగత్తునకు తల్లి, **వివరణ :** గచ్ఛతి నడచునది. ప్రపంచము;

అంబా ఏవ అంబిక తల్లి; సృష్టి, స్థితి లయ కారకులయిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు తల్లి.

రాకాచంద్రవదనాయామ్ = పూర్ణచంద్రుని వంటి ముఖము కలదియు, **వివరణ :** రాకా అనగా రాతి దదాతి పూర్ణప్రకాశమ్ – నిండు వెన్నెల నిచ్చునది. నిండు వెన్నెలను ఇచ్చు పౌర్ణమినాటి చంద్రుని వంటి ముఖము కలది ఈ కమలాంబిక. చంద్ర పదానికి చందతి ఆహ్లాదయతి ఆనందింపచేయువాడు. చందతి దీప్యతే ప్రకాశించునది అని రెండు అర్థాలు. కమలాంబిక ముఖ సందర్శనముతో ఆనందము, జీవన అంధకారంలో ప్రకాశము రెండు కలుగుతాయి.

రాజీవనయనాయామ్ = రాజీ పత్రశ్రేణిః అస్య అస్తి పత్రములు కలది కనుక కమలాన్ని రాజీవమంటారు. కమలము వంటి కన్నులు కలది కమలాంబ.

పాకారినుత చరణాయామ్ = (పాకస్య తన్నామ్నః రాక్షసస్య అరిః శత్రుః ఇంద్రః ) పాక అను రాక్షసునికి శత్రువు కనుక ఇంద్రునికి పాకారి అని పేరు. ఈ ఇంద్రునిచేత కొలువబడిన చరణములు కలది.

ఆకాశాదికిరణాయామ్ = ఆకాశాది పంచభూతములను కిరణములు కలది కమలాంబ. **వివరణ :** ఆకాశాదికిరణా – శ్రీదేవి పాదకాంతుల నుండి పంచభూతాత్మకమై (1. పృథివి, 2. జలము, 3. తేజస్సు, 4. వాయువు, 5. ఆకాశము) ప్రపంచము ప్రభవించినదని భావం.

హ్రీంకార విపిన హరిణ్యామ్ = హ్రీంకారమంత్రమను అడవియందు చరించు లేడివంటిదియు, **వివరణ :** హ్రీంకారవిపినహరిణీ : హ్రీంకారము భువనేశ్వరి మంత్రబీజము. హ్రీం శక్తివాచకం. పరమేశ్వరి "హ్రీంకార" స్వరూపిణి. హ్రీంకారం శివశక్త్యైక్యరూపం. మాయాబీజం. భువనేశ్వరీమంత్రస్వరూపం, 'హ'కారం అనంతమైన జ్ఞానానికి సూచితం. 'రేఫము' తేజస్సునకు, 'ఈ'కారం సర్వశక్తిత్వమునకు సూచితాలు. ఆ హ్రీంకారమను మహారణ్యము మధ్య సంచారిణియని కనుక అమ్మవారు హ్రీంకార విపిన హరిణి అనియు, హ్రీంకార సుశరీరిణి యనియు, హ్రీంకార తరుమంజరియనియు, హ్రీంకారేశ్వరి యనియు నామములు హ్రీంకారముతో శ్రీలలితాత్రిశతీ నామస్తోత్రమున 60 నామములున్నవి.

దయాసాగరుడైన శ్రీశంకరస్వామి శాక్తమతము సుబోధకంగా నుండురీతి, శ్రీలలితాత్రిశతీ భాష్యమును తత్త్వస్ఫోరకముగా రచించారు. ఇందులో "**హ్రీం**"

బీజపారమ్యమును చక్కగా వర్ణించి యున్నారు. "హ్రీం" బీజము నుండి "హ్రీ" అనెడి శక్తి యుద్భవించినది. "**హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ**" యనుచు పురుషసూక్తము ఆ శక్తిని పరబ్రహ్మ నిత్యానపాయినిగా చెప్పుచున్నది. "హ్రీ"లో పురుషబీజముతో 'హర' యైనదనియు, స్త్రీబీజముతో 'హరి' యైనదనియు ఈంకారముతో శక్తిబీజమైన "హ్రీం" అయినదనియు సంప్రదాయ వేత్తల అనుభవం. లలితాత్రిశతిలో "హ్రీంకారారణ్య హరిణీ॥ అను నామము కలదు. దీనికి శంకరులు చేసిన భాష్యానికి శ్రీతాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి గారి అనువాదమిది. "అరణ్యములో ప్రవేశించిన ధీరపురుషునకు వెంటనే హరిణి (లేడి) దృష్టి పదమునకు రాగా, వ్యాఘ్రాదులు అచట లేవను నిశ్చయము కలుగును. అట్టి నిశ్చయము కలిగినంతనే యా యరణ్యము ప్రవేశార్హరూపమైన ఫలప్రాప్తి సాధనత్వమును తెలియజేయును. ఆ రీతిగా నిరంతర భక్తి సేవనాపరులయిన ప్రాణులకు ఉపాసనా పరిపాక మహిమ చేత అజ్ఞానము తొలగి అపరోక్ష జ్ఞానానుభవము వలన భయము నపాకరించుట (పోగొట్టుట) ద్వారా ఆనందానుభూతిని కలిగించునది గావున అరణ్యసంచారియైన పరమేశ్వరి పోల్చబడినదని భావము.. (శం.గ్రం.ర. 12వ సంపుటం)

హ్రీంకారసుశరీరిణ్యామ్ = హ్రీంకారమే అందమైన శరీరముగా కలది, హ్రీంకార తరుమంజర్యాం = హ్రీంకారవృక్షమునకు పూసిన పూలగుత్తి వంటిది, హ్రీంకారేశ్వర్యామ్ = హ్రీంకారమునకు ఈశ్వరియు, గౌర్యామ్ = గౌరియు, **వివరణ :** కన్యాకుబ్జే తథా గౌరీ (మత్స్య మహాపురాణము 13వ అధ్యాయం 29వ శ్లోకం) కన్యాకుబ్జంలో గౌరీదేవితో పిలువబడిన తల్లి. బ్రహ్మజ్ఞానకాంతితో వెలుగొందునది గౌరి.

శరీరత్రయ విలక్షణ సుఖతర స్వాత్మాను భోగిన్యామ్ = స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయమునకు అందనిది (విలక్షణమైన ఆనందానుభవమును ప్రసాదించునదియని భావము.) అపరోక్షానుభూతిస్వరూపిణి కమలాంబిక అని కవి హృదయం.

శీర్యతే ఇతి శరీరం. శీర్ణమై పోయేది గనుక దేహానికి శరీరమని పేరు ఏర్పడింది. ఏది సడలి జీర్ణమై పోతుందో అది శరీరం. శరీరమనగా ఆవరించేది. కప్పివేసేది అని కూడా అర్థమే. చైతన్యాన్ని కప్పే ఉపాధులన్నీ శరీరాలే.. అవిద్యా కామకర్మలు మూడూ మూడు శరీరాల కిందికే వస్తాయి. అవిద్య కామం నిరాకారమైనా అవి మన ఆత్మను కప్పివేస్తున్నాయి కనుక ఒకటి కారణశరీరం (సుషుప్తికి సంబంధించిన శరీరం – అవిద్య) మరొకటి సూక్ష్మశరీరం అని (స్వప్న శరీరం – కామం) పిలవబడుతున్నాయి. కర్మ స్థూలమైన శరీరంగా, సాకారంగా కనిపిస్తూ ఉన్నది. అన్నీ చేస్తూ ఉన్న పని ఒక్కటే. అది మన స్వరూపాన్ని సంపూర్ణంగా మనకు చూపక మరుగుపుచ్చటం. ఈ స్థూల

సూక్ష్మ కారణ శరీరములకు మూడింటికి విలక్షణమైన ఆనందానుభవమును (ఆత్మా–నుభవమును) కమలాంబిక తనను కొలిచే భక్తులకు ప్రసాదిస్తుందని కవి హృదయం.

**స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతతిః** = (తనకు సంబంధించిన ఆనందముతో లేశమాత్రమైన బ్రహ్మానందము, ప్రజాపతి ఆనందము – మొదలైన ఆనందముల సమూహము గలది లలితాదేవి. స్వాత్మానందము గొప్పదని ఈ నామభావం) అను లలితాసహస్రము ఇక్కడ జ్ఞప్తి చేసుకొనదగినది. 'స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వవిగ్రహా" (తనలోని ఆత్మతత్త్వమే లలితా పరమేశ్వరి)

**విరించిహరీశానహరిహయవేదితరహస్యయోగిన్యామ్** = బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, ఇంద్రాదులచే తెలియబడిన రహస్య స్వరూపిణియు, **వివరణ :** బ్రహ్మ, విష్ణు మహేశ్వర, ఇంద్రాదులచే తెలుసుకొనబడిన సప్తమావరణ దేవతయైనది శ్రీకమలాంబిక. సప్తమావరణ దేవతలకు రహస్యయోగినులని పేరు. రహస్య యోగినుల రూపంలో అమ్మవారు ఉన్నారని భావం.

**పరాదివాగ్దేవతారూపవశిన్యాదివిభాగిన్యామ్** = పరాది వాగ్దేవి రూప వశిన్యాది దేవతారూపిణియు, **వివరణ :** పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరి అని నాలుగు విధములైన వాక్కులను, వశిని మొదలైన ఎనిమిది దేవతలుగా కమలాంబిక ప్రకటిస్తున్నదని భావం.

**ప్రాణంలో పరా వాక్కు, మనస్సులో పశ్యంతి వాక్కు, ఇంద్రియములందు మధ్యమ వాక్కు, వాక్రృటనయందు వైఖరీ వాక్కు ఉంటాయని చెబుతారు.** బయటకు కనబడే చెట్టుకు కనబడని వేరు ఉన్నట్టుగా , వైఖరీ వాక్కుకు లోపల పరా, పశ్యంతి, మధ్యమా లోపల ఉన్నాయి. కంఠం నుంచి పెదవి వరకు ఉన్న ఎనిమిది స్థానాలలో ఈ వశిన్యాది దేవతలు ఉన్నారు. ఈ శరరమే ఒక శ్రీచక్రం. వశిన్యాది ఎనిమిది దేవతలు మన శరీరంలోనే ఉండి మనకు వాక్కు కలిగిస్తున్నారు. ఈ భావనతో అమ్మని ఆరాధిస్తే దివ్యమైన అనుభూతి కలుగుతుంది.

పరమేశ్వరుని మాయాశక్తి సంకల్ప రూపమైనది. మొదటిది పరా. పరాస్య శక్తిః. పరమాత్మతో ఏకమై ఉన్నప్పుడు అది నిశ్చలం. పరమాత్మ నాశ్రయించి ఉంటే అది పర. తన్ను తాను పరామర్శించుకొంటే పశ్యంతి. క్రిందికి దిగి సృష్టికి అభిముఖమైతే మధ్యమ. సృష్టిగా మారిపోతే వైఖరి. పరాదశలో ఉన్న ఆ వాక్కు లేదా శబ్దం పరమమైన అర్థాన్నే చెబుతుంది. వాక్కు పరమం. అది చెప్పే అర్థమూ పరమమే. ఇవే ప్రకాశ విమర్శలని పేర్కొంటారు శివాద్వైతులు. అర్థాన్ని ఎంతెంత విమర్శిస్తూ పోతే అంతంత

దాని ప్రకాశం బయట పడుతుంది. పూర్తిగా విమర్శిస్తే పూర్తిగా అనుభవానికి వస్తుంది. అదే **బ్రహ్మానుభవం**. ఇది **శబ్దార్థసహాయంతోనే మానవుడు సాధించాలి.**

వశిన్యాది అష్టదేవతలు సప్తమావరణములో ఉన్న వాగ్దేవతలు. పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరి అని నాలుగు విధములైన వాక్కులు – ఎనిమిది విధములైన వశిన్యాది వాగ్దేవతారూపమున (వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, కౌళినీ, సర్వేశ్వరీ.) కమలాంబిక ఉన్నదనిభావం. ఈ వాగ్దేవతలు అక్షారాల్లోని ఎనిమిది వర్గాలకు అధికారిణులు.

చరాత్మకసర్వరోగహరనిరామయరాజయోగిన్యామ్ – చరాత్మక జగత్తుయొక్క సర్వరోగములను హరించు నిరామయమైన (మానసిక శారీరక వ్యాధిలేని) రాజయోగ స్వరూపిణియు, **వివరణ :** చరాచరాత్మక అనకుండా చరాత్మక అన్నారు కవి. అనగా శరీరమని భావం. సాంసారికములయిన అనేక రోగములు కదిలే జీవులమయిన మనలను బాధిస్తుంటాయి. సాంసారికమయిన రోగములను (దుఃఖములను) పోగొట్టు విద్యా స్వరూపిణి రాజయోగిని (ఉత్కృష్టజ్ఞానస్వరూపిణి, రాజరాజేశ్వరి) శ్రీకమలాంబ. ఆమె సర్వరోగహరచక్రవాసిని – అని శ్లేష.

కరధృతవీణావాదిన్యామ్ = చేతియందున్న వీణను వాయించునట్టిదియు, **వివరణ :** రాజశ్యామలాదేవి రూపమున కమలాంబిక వీణాధారిణిగా ఉన్నది. **మాణిక్యవీణా ముపలాలయంతీం... స్మేరశోణాధరే చారువీణాధరే పక్వబింబాధరే...** ఇలా కాళిదాసు కూడా శ్యామలాదండకంలో అమ్మవారిని స్మరిస్తూ పరవశించాడు.

కమలానగరవినోదిన్యామ్ = కమలాకరమను పేరు తిరువాయూరు నందు వేంచేసినది కమలాంబిక, **వివరణ :** కమలానగరవినోదిని : తిరువారూరునకు కమలానగరమని నామాంతరము. అచ్చట శ్రీకమలాంబిక కొలువు తీరి ఉన్నది.

సురవరమునిజనమోదిన్యామ్, గురుగుహవరప్రసాదిన్యామ్ : దేవతా శ్రేష్ఠులకు ముని జనులకు సంతోషము కలిగించి సద్గురువైన గుహునికి (కుమారస్వామికి) వరములు ఇచ్చునది. **వివరణ :** దేవతా శ్రేష్ఠులకు మునిజనులు అమ్మని ఆనందంగా సేవిస్తుంటారు. అమ్మని మనం కూడా ఆనందంగా సేవించాలని కవి హృదయం. శక్తిభల్లాన్ని, శివజ్ఞానాన్ని కుమారస్వామికే (గుహునికి) అమ్మవారు వరాలుగా ప్రసాదించింది.

**తా :** ఆశ్రిత జనులకు కల్పవృక్షము వంటిదియు, చండికయు, జగదంబికయు, పూర్ణచంద్రుని వంటి ముఖము కలదియు, ఆకాశాది పంచభూతములను కిరణములు

కలదియు, హ్రీంకార మంత్రమను అడవిలో తిరుగు లేడివంటిదియు, హ్రీంకార యంత్రము తన శరీరముగా కలదియు, హ్రీంకార వృక్షమునకు పూసిన పూలగుత్తి వంటిదియు., హ్రీంకారమునకు ఈశ్వరియు, గౌరియు, స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయమునకు అతీతమగు ఆత్మానుభవస్వరూపిణియు, బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, ఇంద్రాదులచే తెలియబడిన రహస్యస్వరూపిణియు, చరాత్మకమైన ప్రపంచముయొక్క సర్వరోగములను హరించు నిరామయమైన రాజయోగస్వరూపిణియు, చేతి యందున్న వీణను వాయించునట్టిదియు, కమలాకరమను పేరు కలిగిన తిరువాయూరు నందు అవతరించి ఉన్నట్టిదియు, సుర, నర, ముని జనులకు సంతోషము కలిగించునట్టిదియు, సద్గురువైన గుహునికి వరములిచ్చునదియునగు కమలాంబయందు నేను భక్తి చేయుచుంటిని.

**వి :** శ్రీచక్ర సప్తమావరణ వివరములు. ఇది అష్టకోణ చక్రము. సర్వరోగహర చక్రమను ఇంకొకపేరు. కకార ప్రకృతికము. పద్మరాగ కాంతి కలిగినది.

అష్టవిధమైన ప్రకృత్యాత్మకము. (భూమిరాపోనలో...). ఇచట దేవతలు ఎనిమిది మంది కలరు. వారు వాగ్దేవతలు. వారి పేర్లు వశినీ, కామేశ్వరీ, మోదినీ, విమలా, అరుణా, జయినీ, కౌళినీ, సర్వేశ్వరీ. వీరు సంధ్యారాగపు రంగు కలిగిన అరుణకాంతి దేహముల వారు. వీరికి రహస్యయోగినులని పేరు.

చక్రేశ్వరి త్రిపురాసిద్ధాంబ. రసము హాస్యము. ఈ కీర్తన సప్తమావరణ కీర్తన. ఇది సప్తమీవిభక్తిలో ఉన్నది. స్వస్తి.

---

## 9. శ్రీకమలాంబికేఽవావ

**॥ అష్టమావరణకీర్తనమ్ ॥ సంబుద్ధ్యంతం ॥**

**రాగం : ఘంటా, ఆది తాళం**

**పల్లవి :** **శ్రీకమలాంబికేఽవావ**
**శివే కరధృతశుకశారికే**

**అనుపల్లవి :** **లోకపాలిని కపాలిని శూలిని**
**లోకజనని భగమాలిని**
**సకృదాలోకయ మాం సర్వసిద్ధిప్రదాయికే**
**త్రిపురాంబికే బాలాంబికే**

**చ : సంతప్తహేమసన్నిభదేహే సదాఖండైకరసప్రభావే**
**సంతాపహరత్రికోణగేహే సకామేశ్వరిశక్తిసమూహే**
**సంతతం ముక్తిఘంటామణిఘోషాయమానకవాటద్వారే**
**అనంతగురుగుహవిదితే కరాంగుళినఖోదయవిష్ణుదశావతారే**
**అంతఃకరణేక్షుకార్ముకశబ్దాదిపంచతన్మాత్ర-**
**విశిఖాత్యంతరాగపాశద్వేషాంకుశధరకరే**
**అతిరహస్యయోగినిపరే!**

**ప్ర :** శ్రీకమలాంబికే! = శ్రీ కమలాంబికా! (శ్రీదేవీ!), అవ అవ = నన్ను రక్షింపుము రక్షింపుము, **వివరణ :** ఆర్తి ఎక్కువైనప్పుడు కాపాడండి... కాపాడండి అంటాము. అదే పద్ధతిలో కవి ఆర్తితో రెండు సార్లు "అవ అవ"అన్నారు. శివే! = ఓశివా! అని అర్థం, **వివరణ :** శివస్య స్త్రీ – శివుని భార్య కనుక దుర్గామాత శివా... శివునితో భేదం లేనిది కనుక "**శివా**" శివుడెటువంటి వాడో దేవికూడా అటువంటిదే. దేవియెట్లో శివుడు కూడా అటువంటివాడే. ఈ అభేదబుద్ధితో ఉమను శివా అని పిలుస్తున్నారు (లింగపురాణము),

కరధృతశుకశారికే = హస్తములందు శుక శారికలు ధరించిన దేవి, **వివరణ :** శోభతే శోభించునది కనుక చిలుకకు శుకమని పేరు. శారిరేవ శారికా గోరువంక అని ఒక అర్థం. తంతి మీటుటకు బంగారులోనగువానితో జేసి వ్రేలికి వేసికొనెడు గోరును **కొడుపు** అని శారికకు ఇంకొక అర్థం. శుకమును, వీణ వాయించు కొడుపును ధరించుదేవి శ్యామలాదేవి. మంత్రశాస్త్రములో "శ్యామల" ప్రసిద్ధమయినది. ఈమె **మంత్రిణ్యంబా**యని అంటారు. శ్యామలమూర్తి ఎనిమిది విధములు. శ్రీ లఘుశ్యామలాంబా, శ్యామలాంబా, శ్రీవీణాశ్యామలాంబా, శ్రీశారికాశ్యామలాంబా, శ్రీశుకశ్యామలాంబా, శ్రీరాజ-శ్యామలాంబా, హసంతి శ్యామలాంబా, మహాశ్యామలాంబా – ఈ మూర్తులకు పూర్వా-మ్నాయమున (పరంపరగా అభ్యసింపబడునది. వేద బ్రాహ్మణాది మూలశాస్త్రములలో మొదటిది). ప్రత్యేక మంత్రములున్నవి.

అనుపల్లవి : లోకపాలిని = లోకములను పాలించు తల్లి, కపాలిని **వివరణ :** కపాలమును, శూలమును ధరించు దుర్గాదేవి. వివరణ : ధ్యానము చేసే మన కపాలము (పుర్రె) అమ్మ చేతిలో ఉన్నది. కనుక మనకు ధ్యానమునందు నిష్ఠకుదరాలంటే అమ్మ దయ కావాలి. **యజ్ఞద్రవ్యపాత్ర** కూడా కపాలమే. అనగా యజ్ఞస్వరూపిణి అని ఇంకొక అర్థం.

శూలిని = శూలము ధరించిన తల్లి, లోకజనని = లోకములకు తల్లి, భగమాలిని = భగుడు మొదలుకొని 12 ఆదిత్యుల వరుస కలిగినది కనుక భగమాలిని. **వివరణ :**

పదునైదు తిథులును, పదునైదు నిత్యారూపములను ధరించి భగమాలిని శ్రీచక్రమున నివసించు శ్రీదేవిని సేవించుచున్నది. అందు భగమాలిని శుక్లపక్షమున ద్వితీయ, కృష్ణపక్షము చతుర్దశి. ద్వాదశాదిత్యులు (అదితి సంతానం కనుక ఆదిత్యులు) ఎవరనే దానికి అయిదు పట్టికలు కనిపిస్తున్నాయి.

మొదటి పట్టిక – వరుణుడు, సూర్యుడు, సహస్రాంశుడు, ధాత, తపనుడు, సవితృడు, గభస్తి, రవి, పర్జన్యుడు, త్వష్ట, మిత్రుడు, విష్ణువు.

రెండవ పట్టిక – ఆర్యముడు, మిత్రుడు, అరుణుడు, అర్కుడు, భగుడు, ఇంద్రుడు, వివస్వంతుడు, పూషుడు, పర్జన్యుడు, త్వష్ట, విష్ణువు, అజఘన్యుడు.

మూడవ పట్టిక – ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూషుడు, ఆర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు.

నాలుగవ పట్టిక – మిత్ర, రవి, సూర్య, భాను, ఖగ, పూష, హిరణ్యగర్భ, మరీచ్య, ఆదిత్య, సవితృడు (సవిత), అర్క, భాస్కరులు.

ఈ పట్టికలలో చాలా పేర్లు అందులోనూ ఇందులోనూ కనిపిస్తాయి. ఒకటి రెండు పేర్లు తేడా ఉన్న పట్టికలు ఉన్నాయి. వాల్మీకి రామాయణం యుద్ధకాండలో రాముడికి అగస్త్యుడు ఉపదేశించిన 'ఆదిత్యహృదయం' స్తోత్రంలో ఈ పేర్లన్నీనూ, ఇవి గాక ఇంకా చాలానూ ఉన్నాయి. అన్నీ సూర్యుడి పేర్లే.

సకృదాలోకయ మామ్ : ఒక్కసారి నన్ను చూడు తల్లీ! (దయని చూపించమని ప్రార్థన), సర్వసిద్ధిప్రదాయికే = సర్వసిద్ధులను ఇచ్చు తల్లి, **వివరణ :** సాధారణ వ్యక్తులకు ఉండని, అతీంద్రియశక్తులను సిద్ధులు అంటారు. ఇవి ఐదు విధాలని పాతంజల యోగశాస్త్రం (కైవల్యపదం) తెలియజేస్తున్నది. పూర్వజన్మలో సాధనవల్ల కలిగేవీ, దేవతలకు జన్మచేతనే కలిగేవీ జన్మసిద్ధులు. కొన్ని ఓషధుల వల్ల కలిగేవి ఓషధజ సిద్ధులు. కొన్ని మంత్రాలవల్ల కలిగే సిద్ధులు మంత్రసిద్ధులు. నాలుగోవి తపస్సు వల్ల కలిగే సిద్ధులు. సమాధిస్థితి వల్ల కలిగేవి సమాధి సిద్ధులు.

1. జన్మసిద్ధి, 2. ఓషధిసిద్ధి, 3. మంత్రసిద్ధి, 4. తపఃసిద్ధి, 5. సమాధిసిద్ధి (పంచసిద్ధులు)

2. 1. అణిమ, 2. మహిమ, 3. గరిమ, 4. లఘిమ, 5. ప్రాప్తి, 6. ప్రాకామ్యము, 7. ఈశత్వము, 8. వశిత్వము. (అష్టమహాసిద్ధులు)

3. అష్టమహాసిద్ధులు (అ) 9. అనూర్మిమత్త్వము, 10. దూరశ్రవణము, 11. దూరదర్శనము, 12. కామరూపత్వము, 13. పరకాయప్రవేశము, 14. స్వేచ్ఛా మరణము,

15. సురక్రీడాదర్శనము, 16. సంకల్పసిద్ధి, 17. మనోజవము, 18. అకుంఠితత్వము. (అష్టాదశ సిద్ధులు భాగవతము 11–15) సర్వ అను పదానికి ఆదిశంకరులు బ్రహ్మమని అర్థము చెప్పారు కనుక సర్వసిద్ధిప్రదాయికే అనగా మోక్షదాయిని అని ఇంకొక అర్థం.

త్రిపురాంబికే **వివరణ :** త్రిపురాంబ, అష్టమావరణ అధిష్ఠాత్రి, త్రిపురసుందరి బాలాంబికే, **వివరణ :** బాలామంత్ర బీజాలు మూడును అష్టమావరణ త్రికోణములందున్నవి (వాగ్బీజ, మన్మథబీజ, సోమరాజు బీజములు), అందుచేత సమష్టి అష్టమావరణత్రికోణచక్రము బాలాంబా రూపమే).

సంతప్తహేమసన్నిభదేహే! = శుద్ధి చేయబడిన (పుటం పెట్టిన) బంగారు రంగులో శరీరఛాయ కలదానా!, **వివరణ :** శుద్ధిచేయబడిన బంగారముతో (ఎరుపు పసుపు రంగుల కలయిక) సమమైన దేహచ్ఛాయ గలది. బంగారు కామాక్షి (బ్రహ్మదేవుడు తయారు చేసిన విగ్రహం. శ్యామశాస్త్రి గారు ఆరాధించినది. బంగారు తల్లి అని ఇళ్ళలో పిల్లలను పిలుచుటలో కూడా ఈ అమ్మపేరు రవళిస్తున్నది.

"**హిరణ్యవర్ణాం**" అను శ్రీసూక్త నామము సంతప్తహేమసన్నిభదేహ ప్రస్తావనలో జ్ఞప్తికి వచ్చుచున్నది.

సదాఖండైకరసప్రభావే (ప్రవాహే అని పాఠాంతరం) ! = నిత్యమై అఖండమైన ఆనందరసప్రభావా! ; **వివరణ :** నిరంతరమై, సంపూర్ణమైన ఆనందరస ప్రభావం కలది. "అఖండైక రసానందకరే పరసుధాత్మని స్వచ్ఛందస్ఫురణామాత్రనిధేహి కులనాయికే నమః" అని సాంప్రదాయ ధ్యాన శ్లోకము (అమృతమాతా! సన్నిహితురాలివి కమ్ము!), ఆనందాలు రకరకాలు.

1. మనుష్యానందము :

ఉత్తమ ఆశయములు, దృఢమైన సంకల్పశక్తి కలవాడు, బలిష్ఠుడు, వేదాధ్యయన సంపన్నుడు, సద్గుణశాలి, నడి యవ్వనములోనున్న ఏకఛత్రాధిపతి, ఐశ్వర్యవంతుడు అయినట్టి మానవుని ఆనందము. మానవులలోకెల్లా అధికాధిక ఆనందమును అనుభవించు మానవుని ఆనందము. ఇది కారణముతో కూడిన ఆనందము. కారణము నశించిన ఉండనిది.

2. మనుష్య గంధర్వ ఆనందము : పైన చెప్పిన మనుష్యానందమునకు నూరు రెట్లు అధికము.

3. దేవగంధర్వానందము : ఇది మనుష్య గంధర్వానందమునకు నూరు రెట్లు అధికము.

4. చిరలోక వాసులగు పితరుల ఆనందము : దేవ గంధర్వ ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

5. అజానజుల ఆనందము : పితరుల ఆనందము కంటే నూరు రెట్లు అధికము.

6. వైదికకర్మలచేత దైవత్వము పొందిన కర్మ దేవతల ఆనందము : అజానజుల ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

7. దేవతల ఆనందము : కర్మదేవతల ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

8. ఇంద్రుని ఆనందము : దేవతల ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

9. బృహస్పతి ఆనందము : ఇంద్రుని ఆనందము కంటే నూరు రెట్లు అధికము.

10. ప్రజాపతి ఆనందము : బృహస్పతి ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

11. హిరణ్యగర్భుని ఆనందము : ప్రజాపతి ఆనందము కంటె నూరు రెట్లు అధికము.

12. బ్రహ్మానందము : హిరణ్యగర్భుని ఆనందము కంటె నూరు రెట్లు అధికము. దీనికే **మహానందము** అని ఇంకొకపేరు. ఈ మహానందమయి అమ్మవారని శ్రీదేవీఖడ్గమాలా స్తోత్రంలో ఉంది. దీక్షితుల వారు ఈ సమాసములో **సదాఖండైకరసప్రభావా** అని ఈ మహానంద నామాన్ని ఇంకొక రకంగా మనకు గుర్తు చేసారు. పోతన్నగారు **మహానందాంగనా డింభకుడ**ని భాగవత ప్రారంభ పద్యంలో శ్రీకృష్ణునికి విశేషణం వాడారు. అమ్మవారి కొడుకుగా కృష్ణుణ్ణి (విష్ణువుని) చెబుతూ లలితాసహస్రం **కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః** అని చెప్పింది. శ్రీమహావిష్ణువు అవతారాలు అమ్మవారి చేతి గోళ్ళలోంచి వచ్చాయి కాబట్టి 'శ్రీమహావిష్ణువు' మహానందమయి కుమారుడు.

సంతాపహరత్రికోణగేహే : తాపత్రయములను హరించు త్రికోణచక్రమందున్న దేవీ, **వివరణ :** తాపత్రయములు హరించునట్టి త్రికోణచక్రమను అష్టమావరణనివాసిని అమ్మవారు. తాపత్రయము  ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మికములని మూడు రకములు. ఈ తాపత్రయం శాంతించుటకై ఉపనిషత్ శాంతిపాఠములో శాంతిపదము మూడు పర్యాయాలు ఉచ్చరిస్తాము. తాపత్రయం శాంతించగా వాసనాక్షయం, మనోనాశనం, తత్త్వజ్ఞానం లభిస్తాయి.

సకామేశ్వరీశక్తిసమూహే : మహాకామేశ్వరీ, మహావజ్రేశ్వరి, మహాభగమాలినీ, అను అష్టమావరణ దేవత లైన శక్తుల సమూహమును కలిగియున్న చక్రేశ్వరి యగు త్రిపురాంబ.

సంతతం ముక్తిఘంటామణిఘోషాయమానకవాటద్వారే = సిద్ధులకు స్వాగతం పలుకు

ఘంటా నాదము నిరంతరము కలిగిన మోక్షకవాటద్వారము కలదానా! **వివరణ** : ఒక అద్భుతమైన మోక్ష ద్వార కవాటము. అమ్మవారి కృపకు పాత్రులయిన వారికి ఈ కవాటము తెరుచుకొంటుంది. త్రికోణము ముక్తి ద్వారము. అది సిద్ధపురుషులను స్వాగతిస్తూ ఘంటలు మోగిస్తున్నట్టు ఉన్నది. చాటే ధ్వనికి ఘోషాయమానము. ఈ ఆవరణకు సాధకుడు చేరుకోగల్గితే ముక్తిని పొందుతాడని భావం.

ఈ సంబోధనలో ఘంటారాగ ప్రస్తావన కూడా కనబడుతున్నది.

శ్లో॥ హినస్తి దైత్యతేజాంసి స్వసేనాపూర్య యా జగత్ ।
సా ఘణ్టా పాతు నో దేవి పాపేభ్యో నః సుతానివ ॥ దేవీ! ఏ ఘంట తన నాదముతో జగత్తునంతను నింపే రాక్షసుల తేజస్సును హరింపజేయునో, అట్టి ఘంట తల్లిదండ్రులు తమ కన్న బిడ్డలను కాపాడునట్లు మమ్ము పాపములనుండి రక్షించుగాక!) అని దుర్గా సప్తశతి. అందువలననే దీక్షితుల వారు **ఘంటారాగము**న ఈ అష్టమావరణ కీర్తన రచించారు.

అనంతగురుగుహవిదితే = అనంతమూర్తియగు గురు గుహునిచే (సుబ్రహ్మణ్యునిచే) తెలియబడిన దానా!. **వివరణ** : అమ్మవారి అనంతతత్వము గురురహస్య (గురు) సంప్రదాయజ్ఞులకు తెలుస్తుందని ఇంకొక సమన్వయం.

కరాంగులినఖోదయవిష్ణుదశావతారే = తన కుడి ఎడమ చేతులయొక్క పదివేళ్ళ గోళ్ల సంధుల నుండి పుట్టిన నారాయణుని దశావతారములు కలది ఆ లలితాదేవి. **వివరణ** : **కరాంగులినఖోత్పన్ననారాయణదశాకృతిః** : (శ్రీ లలితాసహస్రనామావళిలో 80వ నామము) భండాసురుడు సర్వ ఆసురాస్త్రమును శ్రీదేవితో యుద్ధము చేసేటప్పుడు ప్రయోగించాడు. ఆ అస్త్రము నుండి సోమకుడు, రావణుడు, బలి, హిరణ్యాక్ష, హిరణ్యకశిపుడు మొదలయిన రాక్షసులు పుట్టి అమ్మవారితో యుద్ధము చేసారు. అప్పుడు కమలాంబిక యొక్క కుడియెడమచేతుల వేళ్ళ గోళ్ల నుంచి మత్స్య కూర్మ వరాహ, నరసింహ, వామన, పరశురామ, దశరథరామ, బలరామ, కృష్ణ, కల్కి రూపములైన పది అవతారాలు పుట్టి ఆ రాక్షసులను సంహరించాయి (బ్రహ్మాండపురాణము)

ఈశ్వరసంబంధమైన పంచకృత్యములు 1. సృష్టి, 2. స్థితి, 3. లయము, 4. అనుగ్రహము, 5. తిరోధానము) జీవసంబంధమైన జాగ్రత్స్వప్నసుషుప్త్యాది పంచావస్థలు, అను పదియు శ్రీదేవి యొక్క గోళ్ల నుండి అనాయాసముగ పుట్టాయని **కరాంగులి నఖోత్పన్ననారాయణదశాకృతి** కి ఇంకొక సమన్వయము.

అంతఃకరణేక్షుకార్ముకశబ్దాదిపంచతన్మాత్రవిశిఖాత్యంతరాగపాశద్వేషాంకుశధరకరే ! = మనస్సును ఇక్షు కోదండములో (చెఱకువిల్లు), శబ్దాదిపంచతన్మాత్రలను (1. రూపము, 2. రసము, 3. గంధము, 4. స్పర్శ, 5. శబ్దము) పంచపుష్ప బాణములను కలిగి, (1. అరవిందము, 2. అశోకము, 3. చూతము, 4. నవమల్లిక, 5. నీలోత్పలము. లేదా 1. సమ్మోహనము, 2. ఉన్మాదము, 3. శోషణము, 4. తాపసము, 5. స్తంభనము), రాగపాశమును, ద్వేషాంకుశమును ధరించిన చేతులు కలదానా!, **వివరణ :** ఈ త్రికోణ ఆవరణలోనే (సర్వసిద్ధిప్రదచక్రము) ఆయుధ దేవతలను పూజించాలి. ఆయుధాలు జడ స్వరూపాలు కావు. దేవతా మూర్తులు. ఖడ్గమాల (శుద్ధశక్తిమాల) పారాయణ చేసేవారికి ఈ రహస్యం సువిదితము. బాణిని, చాపిని, పాశిని, అంకుశిని అను నాలుగు నామాలు కనబడతాయి. ఇవే చాప, బాణ, పాశ, అంకుశములకు సంబంధించిన దేవతల పేర్లు. ఇందులో చాపాన్ని అంతఃకరణేక్షు కార్ముకముగా దీక్షితులవారు చెప్పారు. (మనోరూపేక్షుకోదండా అని లలితాసహస్రనామము), మనస్సు, పంచతన్మాత్రలు, రాగము, ద్వేషము – ఈ నాలుగు తీసేయగలిగితే వీటికి అతీతమైన నేను అనే బ్రహ్మ జ్ఞానము కలుగుతుంది. అందుకే బ్రహ్మజ్ఞానప్రాప్తి కలగటానికి ఆటంకంగా ఉన్న నాలుగింటిని అమ్మ ధరించిందని అమ్మను శరణు కోరితే ఈ నాలుగింటి నుంచి విముక్తి కలుగుతుందని కవి హృదయం.

అతిరహస్యయోనిపరే! = ఎనిమిదవ ఆవరణ దేవతలయిన అతిరహస్యయోగిని రూపములో ఉన్న ప్రధానదేవత. **వివరణ :** అష్టమావరణ దేవతలు అతిరహస్య యోగినులు. రహస్యము అనగా ఆత్మజ్ఞానము.

**తా** : చేతులందు శుకశారికలు ధరించిన దేవీ! లోకపాలినీ! కపాలినీ! శూలినీ! లోకజననీ! భగమాలినీ! సర్వసిద్ధి ప్రదాయినీ! త్రిపురాంబికా! బాలాంబికా! శుద్ధిచేయబడిన బంగారు వన్నెవంటి శరీరఛాయకలదానా! నిత్యమైన అఖండమైన ఆనందరసప్రభావము కలదానా! తాపత్రయములను హరించు త్రికోణచక్రమందున్న దేవీ! మహాకామేశ్వరీ! మహావజ్రేశ్వరి! మహాభగమాలినీ అను ఎనిమిదవ ఆవరణ దేవతలతో కూడిన చక్రేశ్వరి యైన త్రిపురాంబా, సిద్ధులకు స్వాగతం పలికే ఘంటానాదము కలిగిన మోక్షకవాటద్వారము కలదానా! అనంతమూర్తి అయిన గురుగుహునిచే తెలియబడిన దానా! కుడి ఎడమ చేతుల యొక పదివేళ్ళ గోళ్ల సంధుల నుండి పుట్టిన నారాయణుని దశావతారములు కలదానా!, మనస్సను ఇక్షు కోదండమును, శబ్దాదిపంచతన్మాత్రలను పంచపుష్ప బాణములను, రాగపాశమును, ద్వేషాంకుశమును ధరించిన చేతులు కలదానా, ఎనిమిదవ

ఆవరణ దేవతలయిన అతిరహస్యయోగినిస్వరూపిణీ, పరదేవతా! శ్రీకమలాంబికా! నన్ను కరుణాదృష్టితో చూడు.

**వి :** ఇది యెనిమిదవ ఆవరణకు సంబంధించిన కీర్తన. ఇది సప్తమీవిభక్తి తరువాత చెప్పబడు **సంబోధనాప్రథమావిభక్తి**లో ఉన్నది. (ప్రారంభ కీర్తన కూడా సంబోధనా ప్రథమావిభక్తి). ఈ అష్టమావరణమునకు త్రికోణచక్రమని పేరు. దీనియొక్క మూడు కోణములలో మూడు బిందువులు. దీని ఆకారము త్రికోణము. సర్వసిద్ధిప్రదాచక్రమని దీనికి ఇంకొక పేరు. ఈ చక్ర తత్త్వము గుణత్రయము. మహాకామేశ్వరీ, మహావజ్రేశ్వరీ, మహాభగమాలినీ అనుపేర్లు కలిగిన వారు కోణత్రయ దేవతలు. ఈ ఆవరణ దేవతలు అతిరహస్య యోగినులు. ఈ చక్రేశ్వరి త్రిపురాంబ. అద్భుతము రసము. స్వస్తి.

---

## 10. శ్రీకమలాంబా జయతి

**॥ నవమావరణకీర్తనమ్ ॥**

**రాగం : ఆహిరి, రూపక తాళం**

**పల్లవి :** శ్రీకమలాంబా జయతి అంబా
శ్రీకమలాంబా జయతి జగదంబా
శ్రీకమలాంబా జయతి శృంగారరసకదంబా మదంబా
శ్రీకమలాంబా జయతి చిద్బింబ ప్రతిబింబేందుబింబా
శ్రీకమలాంబా జయతి శ్రీపురబిందుమధ్యస్థచింతామణిమందిరస్థ-
శివాకారమంచస్థిత-శివకామేశాంకస్థా.

**అనుపల్లవి :** సూకరాననాద్యర్చితమహాత్రిపురసుందరీం
రాజరాజేశ్వరీం సువాసినీం
శ్రీకరసర్వానందమయచక్రవాసినీం చింతయేఽహం
దివాకరశీతకిరణపావకాదివికాసపరయా
భీకరతాపత్రయాదిభేదనదురీణతరయా
పాకరిపుప్రముఖాదిప్రార్థితసుకలేబరయా
ప్రాకట్యపరాపరయా పాలితోదయాకరయా

**చరణమ్ :** శ్రీమాత్రే నమస్తే చిన్మాత్రే సేవితరమాహరీశవిధాత్రే
వామాదిశక్తిపూజితపరదేవతాయాః సకలం జాతం

**కామాది-ద్వాదశభిరుపాసిత-కాదిహాదిసాది మంత్ర-రూపిణ్యాః**
**ప్రేమాస్పదశివగురుగుహజనాన్యాం ప్రీతియుక్తమచ్చిత్తాం విలయతు**
**బ్రహ్మమయప్రకాశిని! నామరూపవిమర్శిని!**
**కామకలాప్రదర్శిని! సామరస్యనిదర్శిని !**

శ్రీకమలాంబా జయతి = శ్రీ కమలాంబ జయించునుగాక – సర్వోత్కృష్టముగా అగుగాక, **వివరణ :** జయతి అనగా అన్నింటిని మించునది. దేవతను స్తుతిస్తూ చెప్పే మంగళకరమైన వాచకము జయతి. నా హృదయంలో అన్ని భావనలను మించి అమ్మవారి భావనయే ఉన్నదని చెప్పు పదము. "**జయతి**" అంబా జగదంబా శ్రీకమలాంబా జయతి = అంబిక, లోకమాత యైన శ్రీకమలాంబ జయించును గాక, జయతి శృంగారరసకదంబా = శృంగార రసకదంబ (కూటము) మదంబ, కమలాంబ జయించును గాక, **వివరణ** : కదంబము అనగా గుత్తి, ఈ తల్లి శృంగారరసముయొక్క ఏకస్వరూపిణి. ఈ సుందరి శృంగారపరదేవత. ఈమె "**శృంగారరససంపూర్ణా**" (లలితాసహస్రము 376వ నామం), శృంగార రసము బ్రహ్మానందముతో సమానమైనది. కనుక శృంగార రస సంపూర్ణ అనగా బ్రహ్మానందముతో ఎప్పుడూ నిండి యుండునది అని ఒక అర్థం. శృంగ (= శీర్షములు) అర (=కోణములు) రస (= నవరసాది నామములు) సంపూర్ణా (= మొదలయిన వాటితో నిండుగా ఉన్నది) అని ఇంకొక అర్థం. శీర్షాలతో, త్రిభుజాలతో, కోణములతో, శృంగారాది రసాధిదేవతలతో నిండుగా ఉంటుంది. శ్రీచక్రానికి, అమ్మవారికి అభేదం కనుక ఆమెను కవి శృంగారరసకదంబా అన్నారు. వసు సంఖ్య అనగా 08. మను సంఖ్య అనగా 14. ఆవిధముగానే రససంఖ్య అనగా 09. శ్రీచక్రంలో త్రికోణ చక్రాలు (శృంగ) వృత్త చక్రాలు (అర), కలిపి 09. ఈ తొమ్మిదింటియొక్క సమూహరూపము కనుక **శృంగారరసకదంబా**.

శృంగార రస నాయిక అమ్మవారు. శృంగారమనగా సౌందర్య స్వరూపము. ఈ లోకం మొత్తంలో నిజమైన శృంగారం చైతన్యం. ఈ చైతన్యం అమ్మవారి స్వరూపం. ఆ చైతన్యం లేకపోతే ఈ ప్రపంచం జడ ప్రాయము.

మదంబా శ్రీకమలాంబా జయతి = ఆ కమలాంబ మదంబగా (నా తల్లిగా) జయించుచున్నది. **వివరణ :** ముగురమ్మల మూలపుటమ్మను పోతన్న మాయమ్మ అన్నాడు.

అదే వరుసలో దీక్షితారు వారు ఆత్మీయతాబంధంతో '**మదంబ**' అన్నారు.

చిద్బింబా ప్రతిబింబేందుబింబా శ్రీకమలాంబా జయతి = చైతన్య బిందు స్వరూపిణి. చంద్రబింబము ప్రతిబింబముగా ఉన్న శ్రీకమలాంబ సర్వోత్కర్షణిగా ప్రకాశించుచున్నది.

**వివరణ :** బింబమనగా వృత్తాకారములో ఉండునది. చిద్బింబా అనగా **ప్రకాశబిందువు**. చైతన్య బిందువు. ఇది సృష్ట్యాదిలో ఉన్న వస్తువు. అన్నిటికి కారణము. ప్రతిబింబేందు బింబా అనగా **విమర్శబిందువు**. ఇది రాబోయే సృష్టికి కారణము. శివశక్తి స్వరూపములుగా ఈ ప్రకాశ విమర్శ బిందువులను చెబుతారు.

పుణ్యానందముని వ్రాసిన **కామకలావిలాసము**లోని రెండవ శ్లోకము ఈ విషయాన్ని నిరూపిస్తున్నది.

శ్లో॥ **'సా జయతి శక్తిరాద్యా నిజసుఖమయనిత్యనిరుపమాకారా ।**
**భావిచరాచరబీజం శివరూపవిమర్శనిర్మలాదర్శః ॥ '**

మొట్టమొదట ఉన్న బిందువగు ప్రకాశబిందువు కామేశ్వరస్వరూపము. ప్రకాశ-బిందువులో ఉన్న విమర్శశక్తిని విమర్శబిందువు, ఆ విమర్శశక్తినే తిరువారూరులో ఉన్న శ్రీకమలాంబగా కవి ఈ పల్లవిలో చెప్పారు. చంద్రమండలమధ్యస్థగా అమ్మవారిని ఆరాధించుట ఉన్నది. అమ్మవారి కళలన్ని ఇందు బింబమునందు ఉపాసించు శ్రీచక్రార్చన పద్ధతిని కవి ప్రతిబింబేందుబింబ పదసంయోజనంలో చెప్పారు.

సహస్రారకమలంలో చంద్రబింబరూపంలో అమ్మవారు ఉంటారు. సహస్రార కమలంలో ఈ చంద్రబింబప్రతిఫలనము ఉన్నది కనుక **ప్రతిబింబేందుబింబా**.

శ్రీపుర బిందు మధ్యస్థ చింతామణిమందిరస్థ శివాకారమంచస్థిత శివకామేశాంకస్థా = శ్రీచక్రము మధ్యలోగల బిందువు నందు చింతామణి మందిరమున శివాకార-మంచస్థితుడైన శివకామేశుని వామాంకమందున్న శ్రీకమలాంబ సర్వోత్కృష్టముగా ప్రకాశించుచున్నది. **వివరణ :**

శ్లో॥ **సుధాసంధోర్మధ్యే సురవిటపివాటిపరివృతే**
**మణిద్వీపే నీపోపవనవతిచింతామణిగృహే ।**
**శివాకారే మంచే పరమశివపర్యంకనిలయాం**
**భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీమ్ ॥**

తల్లీ! పాలకడలి మధ్య ఉన్న రత్నాల దీవిలో, కల్పవృక్షాల వరుసతో చుట్టబడిన మణిద్వీపములో, కదంబచెట్ల పూతోటలలో ప్రకాశించునట్టి చింతామణులతో నిర్మితమైన గృహంలో పరమశివ పర్యంకనిలయవై, మంగళరూపమైన (త్రికోణపు) పాన్పుపై, నిరతిశయానంద ప్రవాహ స్వరూపిణివైన నిన్ను కొందరు ధన్యులు మాత్రమే సేవిస్తున్నారు. (అందరికీ నీ సేవ లభించదని భావం). దీనినే కవి **శ్రీపురబిందుమధ్యస్థ** అని వర్ణించారు.

సూకరాననాద్యర్చితమహాత్రిపురసుందరీం రాజరాజేశ్వరీం సువాసినీమ్ = వారాహీదేవి మొదలగు శక్తులచే అర్చింపబడినట్టి రాజరాజేశ్వరీదేవిని మహాత్రిపురసుందరిని సువాసినిని (మంగళస్వరూపిణి) నేను ధ్యానించుచున్నాను. **వివరణ :** సూకరానన అనగా వారాహి. ఈమె దండనాయిక. మంత్రిణి అయిన శ్యామలారూపం క్రితం కీర్తనలో స్మరించుట జరిగింది. అమ్మ నుంచి పుట్టిన వారాహి, శ్యామలా మరలా అమ్మవారినే కొలుస్తున్నాయి. అమ్మవారు ఇచ్ఛాశక్తి. క్రియాశక్తి వారాహి. జ్ఞానశక్తి శ్యామల. భజే శ్రీచక్ర మధ్యస్థాం... శ్లోకంలో ఇదే భావన విస్తరించి ఉన్నది.

శ్రీకర సర్వానందమయ చక్ర వాసినీం చింతయేఽహం = శ్రీకర (ముక్తి ప్రదాన) మైన సర్వానందమయచక్రవాసినియగు శ్రీకమలాంబిక నేను ధ్యానించుచున్నాను. **వివరణ :** శ్రీకరమనగా మోక్షప్రదమైనది. నవావరణమునకు సర్వానందమయచక్రమని పేరు. ఆ చక్రమందు వసించు పరదేవత.

దివాకరశీతకిరణపావకాదివికాసపరయా = సూర్యచంద్రాగ్నులు మొదలైన వాటిని వికసింపచేసే శ్రీకమలాంబిక చేత నేను అనుగ్రహింపబడుచున్నాను. **వివరణ :** అమ్మవారు సూర్యచంద్రాగ్నులకు ప్రకాశము ఇచ్చునది. "**తస్య భాసా సర్వమిదం భాతి**" అను ప్రమాణముచేత చిచ్ఛక్తియగు పరదేవత స్వయంప్రకాశం కలది. **తపనశశివైశ్వానర మయీం** అని సౌందర్యలహరి) అణువులోను, అనంతవిశ్వంలోను ఈ మూడు (సూర్యచంద్రాగ్నులు) మండలాలున్నాయి.

మన శరీరంలో కూడా అమ్మవారు కుండలినీరూప ప్రయాణం చేసేటప్పుడు కుండలినీ ప్రయాణంలో మూలాధారం నుండి రెండు చక్రాల వరకు అగ్ని మండలం, తరువాత అనాహతం దగ్గర సూర్యమండలం. భ్రూమధ్యం నుంచి వెళ్లేటప్పుడు చంద్రమండల మవుతుందని యోగసాధకులు చెబుతారు. **మన వాక్కుకి అగ్ని, మన చూపుకి సూర్యుడు, మనస్సుకి చంద్రుడు అధిదేవత.**

ఆది శబ్దముతో పంచభూతాలు కూడా చెప్పబడుతున్నాయి.

భీకరతాపత్రయాదిభేదనధురీణతరయా = భీకరమైనటువంటి తాపత్రయములను తొలగించుటలో సమర్థురాలగు శ్రీకమలాంబికచేత, **వివరణ :** తాపత్రయము అనగా మూడు తాపాలని అర్థం. 1. దైవసంబంధమైనది, దైవం వలన కలిగేది ఆధిదైవికమనీ, 2. పంచభూతాలకు సంబంధించినది ఆధిభౌతికమని అంటారు. పంచభూతాల వల్ల, అంటే భూకంపాలో, పెను తుఫానులో, అగ్నిపర్వతాలు లావాను విరజిమ్మడమో, ఇంకా

ఇలాంటి ఇతర ఉత్పాతాలో సంభవించి, కలిగించే బాధలు, 3. ఆత్మ తత్త్వసంబంధమైనది ఆధ్యాత్మికము జ్ఞానసంబంధమైన, భక్తిసంబంధమైన, సాధనక్రమంలో కలిగే తాపం ఆధ్యాత్మికము.

ఈ పదాలలో ఆధి శబ్దానికి మానసికమైన అనే అర్థం లేదు. తాపత్రాయాత్మకమే మానవ జీవితం. కనుకనే శాంతిపాఠంలో మూడుసార్లు శాంతి శబ్దాన్ని ఉచ్చరిస్తాం. దీక్షితులవారు అమ్మను సేవిస్తే ఈ భీకర తాపత్రయములు పోతాయని మనకు ఉపదేశిస్తున్నారు.

పాకరిపుప్రముఖాదిప్రార్థితసుకలేబరయా = ఇంద్రాది ప్రముఖులచే ధ్యానించబడు దివ్యశరీరము గల శ్రీకమలాంబికచేత, (నేను రక్షింపబడుచున్నాను), **వివరణ :** ఇంద్రాదులచే ప్రార్థింపబడిన అద్భుతమయిన శరీరము కలది. దేవతలచే ప్రార్థింపబడి వారి కార్యములను తీర్చుటకై శ్రీదేవి శరీరాకారమును స్వీకరించినది. ఆమె దేవకార్య–సముద్యతయై చిదగ్నికుండసంభూతయై దేవతల శత్రువులను వధించి ఇంద్రాదులను కాపాడినది.

ప్రాకట్యపరాపరయా పాలితోదయాకరయా = ప్రకటయోగిని మొదలు పరాపర యోగిని వరకు గల తొమ్మిది విధములైన యోగినుల రూపము ధరించిన శ్రీకమలాంబిక చేత, దయాసముద్రయగు శ్రీకమలాంబికచేత, నేను రక్షింపబడుచున్నాను. **వివరణ :** తొమ్మిది ఆవరణ దేవతలకు యోగినులని పేరు. మొదటి ఆవరణము నందున్న దేవతలు ప్రకటయోగినులు. తొమ్మిదవ ఆవరణ దేవత పరాపరయోగిని. మొదటి ఆవరణమునుండి తొమ్మిదవ ఆవరణం వరకు కల యోగినీ దేవతల సమూహము.

శ్రీమాత్రే నమస్తే చిన్మాత్రే సేవితరమాహరీశవిధాత్రే = మహాలక్ష్మీ విష్ణు రుద్ర బ్రహ్మల వలన సేవింపబడుతున్న శ్రీకమలాంబికకై కేవల జ్ఞానస్వరూపిణి యైన శ్రీమాతకై నమస్కారం. **వివరణ :** శ్రీమాత్రే లోని మాత్రేకు తల్లి అని అర్థం. శ్రీమాత్రే నమః అను మహామంత్రము ఇందులో చెప్పబడింది. చిన్మాత్రే లో మాత్రేకు కేవలమని అర్థం.

వామాదిశక్తిపూజితపరదేవతాయాః సకలం జాతమ్ = వామాజ్యేష్ఠా మొదలగు శక్తులచేత పూజింపబడిన పరదేవతవలన సకలము (ఈ ప్రపంచము) పుట్టినది. అనగా అమ్మవారే ప్రపంచకారిణి అని భావం. **వివరణ :** వామాది శక్తిపూజలందుకొను పరదేవత. వామా, జ్యేష్ఠా, రౌద్రీ మొదలగు శక్తులచేత పూజింపబడిన పరదేవత, వామా – వమనత్వాత్ వామా – వెలిగ్రక్కుట సృష్టికారిణి – జ్యేష్ఠా – పెద్దదయి పాలకురాలిగా

ఉండునది. స్థితికారిణి, రౌద్రీ – లయకారిణి. ఇలా సృష్టిని నడిపే శక్తులన్నీ అమ్మవారివే అని భావం.

కామాది–ద్వాదశభిరుపాసిత–కాదిహాదిసాది–మంత్రరూపిణ్యాః = మన్మథుడు మొదలగు పన్నెండుమంది ఉపాసకులచేత ఉపాసింపబడిన కాదివిద్యా, హాదివిద్యా, సాదివిద్యా లతో కూడిన చిచ్ఛక్తి రూపిణియొక్క మనస్సునాది. **వివరణ :** కామాది ద్వాదశభిరుపాసిత కాదిహాదిసాది మంత్ర స్వరూపిణి : శ్రీదేవి ఉపాసకులు పన్నెండు మంది. వారు వరుసగా మను, చంద్ర, కుబేర, లోపాముద్ర, మన్మథ, అగస్త్య, అగ్ని, సూర్య, చంద్ర, షణ్ముఖ, ఈశ్వర, దూర్వాసో ఋషులు. (మనుశ్చంద్రః కుబేరశ్చ లోపాముద్రాచ మన్మథః అగస్తిరగ్ని సూర్యశ్చ ఇంద్ర స్కంద శ్శివస్తథా క్రోధభట్టారకోదేవ్యా ద్వాదశామీ ఉపాసకాః) వీరు పంచదశీ మంత్రం ఏర్పరిచినవారు. కావున పంచదశీ మంత్రము ద్వాదశ విధమైనది. పంచదశి మహామంత్రము కకారముతో మొదలయి నట్లయితే అది కాది విద్య.

పంచదశి మహామంత్రము హకారముతో మొదలయినట్లయితే అది హాది విద్య.

పంచదశి మహామంత్రము సకారముతో మొదలయినట్లయితే అది సాది విద్య.

ఈ మంత్రసంపుటియొక్క ఏకస్వరూపిణి అమ్మవారని కవి హృదయం.

ప్రేమాస్పదశివగురుగుహజనాన్యాం ప్రీతియుక్త మచ్చిత్తాం విలయతు = ప్రేమాస్పదు రాలైన శివ గురుగుహుని తల్లి యందు నా మనస్సు విలయము పొందుగాక! (లీనమగుగాక!) **వివరణ :** శివుని అంశతో ఉన్నాడు కనుక శివ గురుగుహుడు.

బ్రహ్మమయప్రకాశిని నామరూపవిమర్శిని = ఓ బ్రహ్మమయ ప్రకాశినీ, నామరూప విమర్శినీ : **వివరణ : ప్రకాశము శివస్వరూపము, విమర్శ శక్తి స్వరూపము**, విమర్శరూపిణీ విద్యా (లలితాసహస్రనామములు 554 నామము) మేల్కొన్న జ్ఞాన బిందువును – 'చిత్' బిందువని చెబుతారు. జ్ఞాన వికాస వైభవాన్ని సూచించే బిందువును – 'ప్రకాశ' బిందువనీ అంటారు. ఆ వైభవ విశ్లేషణను సూచిస్తూ వ్యాపించు బిందువును 'విమర్శ' బిందువు అంటారు. ఈ కనబడే బ్రహ్మాండ సంబంధమైన విషయాలు, ఆత్మకు సంబంధమైన ఆత్మానాత్మ వివేచనలు మొదలయినవన్నీ అమ్మవారియొక్క ఈ విమర్శబిందు వికసనం వల్ల కలుగుతుంది.

ప్రకాశము, విమర్శ కలిసిన సమరసముతో కలిసినది శ్రీచక్రములోని బిందువు.

ఈ ప్రకాశించు జగత్తుకు అయిదు రూపములు 1 అస్తి (కలదు), 2. భాతి (జ్ఞానము),

3. ప్రియం (ఆనందము), 4. నామము, 5. రూపము. ఇందు మొదటి మూడు బ్రహ్మ రూపములు. మిగిలినవి లోకమునకు సంబంధించినవి. **శివపార్వతుల పాదపద్మములు ప్రకాశవిమర్శశక్తులు**.

కామకలాప్రదర్శిని! = కామకలాప్రదర్శినీ! నా మనస్సును లయింపుము (నీలో లీనము చేయుము) **వివరణ :** శివశక్తిసంపుటముగా ప్రకాశిస్తూ సకల తత్త్వ సముదాయమునకు, సకల వర్ణకదంబమునకు, శబ్దజాలమునకు జన్మస్థానమై సర్వ కారణంగా ఉన్న దానిని "**కామకలా**" అంటారు.

"**సోఽకామయత బహుస్యాం...**' పరమాత్మ యొక్క సృష్టి చేయాలనే సంకల్పానికి పేరు కామము.

కామమనగా ఇక్కడ బ్రహ్మమని అర్థం. ఆ పరబ్రహ్మయొక్క కల కామకల. అనగా చిచ్ఛక్తి. అది ప్రపంచరూపంలో ప్రదర్శింపబడుతున్నది కనుక అమ్మవారు **కామకలా ప్రదర్శిని**.

సామరస్యనిదర్శిని! = సామరస్యనిదర్శినీ! నా మనస్సును లయింపుము (లీనమగు గాక!) **వివరణ :** సమమైన రసముగల శివశక్తుల భావమే సామరస్యము. సృష్టిలో అమ్మవారి ప్రాధాన్యము. సంహారములో అయ్యవారి ప్రాధాన్యము. మోక్షములో ఇద్దరికి సమమయిన సామరస్యము. అందుకే ఆమె సామరస్యనిదర్శిని. "1. **భోక్తృభోగ్యకరణోర్మి-సంక్షయే సామరస్యదోహినీ శివా**" (భోక్తృభాగ్యములను అలలు నశింపగా శ్రీదేవి సామరస్యరసమును పితుకును). "2. **పరస్పరతపస్సంపత్ పలాయితపరస్పరౌ ప్రపంచ-మాతాపితరౌ ప్రాంచౌ జాయపతీస్తుమః**" (ఒకరికోసం మరొకరు పరస్పరం చేసుకున్న తపస్సుకు ఫలముగా జనులకు లభించిన ప్రపంచపు జననీ జనకులను పార్వతీ పరమేశ్వరులకు నమస్కరిస్తున్నాను చంద్రాలోకము) ఇటువంటి ఉక్తులు అమ్మవారి సామరస్యనిదర్శనత్వమునకు మరికొన్ని ఉదాహరణములు.

**తా :** ప్రథమావిభక్తి : శ్రీకమలాంబ జయించునగాక – అంబిక, లోకమాత యైన శ్రీకమలాంబ జయించునుగాక. శృంగారరసకదంబ (కూటము) మదంబ, కమలాంబ జయించును గాక. చైతన్యబిందుస్వరూపిణి, చంద్రబింబము ప్రతిబింబముగా ఉన్న శ్రీకమలాంబ సర్వోత్కర్షణిగా ప్రకాశించుచున్నది. శ్రీచక్రము మధ్యలోగల బిందువు నందు చింతామణి మందిరమున శివాకారమంచస్థితుడైన శివకామేశుని వామాంక మందున్న శ్రీకమలాంబ సర్వోత్కృష్టముగా ప్రకాశించుచున్నది.

**ద్వితీయావిభక్తి :** వారాహీదేవి మొదలగు శక్తులచే అర్చింపబడినట్టి రాజరాజేశ్వరీదేవిని మహాత్రిపురసుందరిని సువాసినిని (మంగళస్వరూపిణి) నేను ధ్యానించు చున్నాను. శ్రీకర (ముక్తి ప్రదాన)మైన సర్వానందమయ చక్రవాసినియగు శ్రీకమలాంబికను నేను ధ్యానించుచున్నాను.

**తృతీయావిభక్తి :** సూర్యచంద్రాగ్నులు మొదలైనవాటిని వికసింపచేసే శ్రీ కమలాంబిక చేత నేను అనుగ్రహింపబడుచున్నాను. భీకరమైనటువంటి తాపత్రయములను తొలగించుటలో సమర్థురాలగు శ్రీకమలాంబికచేత, ఇంద్రాది ప్రముఖులచే ధ్యానింపబడు దివ్యశరీరముగల శ్రీకమలాంబికచేత, ప్రకటయోగిని మొదలు పరాపరయోగిని వరకు గల తొమ్మిది విధములైన యోగినుల రూపము ధరించిన శ్రీకమలాంబిక చేత, దయాసముద్రయగు శ్రీకమలాంబిక చేత నేను రక్షింపబడుచున్నాను.

**చతుర్థీవిభక్తి :** మహాలక్ష్మీ విష్ణు రుద్ర బ్రహ్మల వలన సేవింప బడుతున్న శ్రీకమలాంబికకై కేవలజ్ఞానస్వరూపిణి యైన శ్రీమాతకై నమస్కారం.

**పంచమీవిభక్తి :** వామా, జ్యేష్ఠా; రౌద్రీ శక్తులచేత పూజింపబడిన పరదేవతవలన సకలము (ఈ ప్రపంచము) పుట్టినది. అటువంటి శ్రీమాతకై నమస్కారం.

**షష్ఠీ విభక్తి :** మన్మథుడు మొదలగు పన్నెండుమంది ఉపాసకులచేత ఉపాసింపబడిన కాదివిద్య, హాదివిద్య, సాదివిద్యలతో కూడిన చిచ్ఛక్తిరూపిణియొక్క మనస్సునాది.

**సప్తమీవిభక్తి :** ప్రేమాస్పదురాలైన శివగురుగుహుని తల్లియందు నా మనస్సు విలయము పొందుగాక! (లీనమగుగాక)

**సంబోధన ప్రథమ** : ఓ బ్రహ్మమయప్రకాశినీ! నామరూపవిమర్శినీ! కామకలాప్రదర్శినీ! సామరస్యనిదర్శినీ! నా మనస్సు నీలో లీనమగుగాక!

**వి :** 1. ఎనిమిది ఆవరణలు లోకానికి సంబంధించిన ఆవరణలు. తొమ్మిదవ ఆవరణలోని బిందువు (లలిత) లోకాతీతమైనది.

2. ఆవరణలు దాటి శివశక్త్యైక రూపముగా ప్రకాశించు తల్లి కనుక ఆమె లలిత.

3. తొమ్మిదవ ఆవరణను గురించిన ఈ కీర్తన సర్వవిభక్తికము. అనగా ఎనిమిది విభక్తులందును కలదు.

4. దీనికి సర్వానందమయ చక్రము పేరు.

5. ఈ చక్రేశ్వరి శ్రీత్రిపురసుందరీదేవి.

6. శాంతరసము ప్రధానమైనది.

7. ఈ ఆవరణ దేవత పరాపరరహస్యయోగిని.

8. ఈ చక్ర అధిష్ఠాత్రి శ్రీరాజరాజేశ్వరీ పరాభట్టిరికా దేవి. స్వస్తి.

## 11. శ్రీకమలాంబికే శివే పాహి మాం

॥ మంగళ కీర్తనమ్ ॥

**రాగం : శ్రీ, ఖండజాతి ఏక తాళం**

పల్లవి : **శ్రీకమలాంబికే! శివే! పాహి మాం లలితే!**
**శ్రీపతివినుతే! సితాసితే! శివసహితే!**
**రాకాచంద్రముఖి! రక్షితకోలముఖి!**
**రమావాణీసఖి! రాజయోగసుఖి!**
**శాకంబరి! శాతోదరి! చంద్రకళాధరి!**
**శంకరి! శంకరగురుగుహభక్తవశంకరి!**
**ఏకాక్షరి! భువనేశ్వరి! ఈశప్రియకరి!**
**శ్రీకరి! సుఖకరి! శ్రీమహాత్రిపురసుందరి!**

**ప్ర :** శ్రీకమలాంబికే! = శ్రీ కమలాంబా!, శివే = మంగళకరగుణములు కలదానా!, **వివరణ :** శివ శబ్దము శివశక్తుల ఉభయవాచకము. శివస్య స్త్రీ – శివుని భార్య కనుక దుర్గామాత శివా.. శివునితో భేదం లేనిది కనుక "శివా". మంగళకరగుణములు కలది కనుక శివా. సకల భూతములకు మేలుచేయునది కనుక "శివా". శివుడెటువంటివాడో దేవికూడా అటువంటిదే. దేవియెట్లో శివుడు కూడా అటువంటివాడే. ఈ అభేదబుద్ధితో ఉమను శివా అని పిలుస్తున్నారు. (లింగపురాణము)

పాహి మామ్ = నన్ను రక్షించు, లలితే! = ఓ లలితాదేవీ!, **వివరణ :** లలిత అనగా లాలయతి, ఆకాంక్షతి అసౌ కోరునది. దుర్గ, అందమైనది; శోభ, విలాసము, గాంభీర్యము, మాధుర్యము, స్థైర్యం, తేజస్సు, లాలిత్యము, ఔదార్యము, సౌకుమార్యము అద్వితీయముగా మూర్తికట్టిన మూర్తి లలిత. లలిత అను పదములో రెండు లకారములు తకారము ఉన్నాయి. ఆవిధముగానే తల్లి అను పదములోను రెండు లకారములు తకారము ఉన్నాయి. కనుక లలితకు, తల్లికి అభేదమని ఒక చమత్కారము.

శ్రీపతివినుతే = లక్ష్మీదేవిపతియైన విష్ణువు చేత నుతించబడిన దానా! **వివరణ :** విష్ణువు కూడా శ్రీదేవి ఉపాసకులలో ఒకడు. శ్రీహరి పరదేవతను ఉపాసించినందువలననే

విష్ణుపదవిలో ఉన్నాడని శ్రీశంకరభగవత్పాదుల సౌందర్యలహరిలో "**హరిస్త్వామారాధ్య**" (5వ శ్లోకం) అను శ్లోకమునందు చెప్పారు.

**శ్లో॥ హరిస్త్వామారాధ్యప్రణతజనసౌభాగ్యజననీం**
**పురా నారీభూత్వా పురరిపుమపి క్షోభమనయత్ ।** ...

(అమ్మా! నమస్కరించిన జనులకు శుభములను ప్రసాదించే ఓ జగజ్జననీ! విష్ణువు నిన్ను పూజించిన ఫలితముగా పూర్వము ఒకనాడు స్త్రీరూపమును ధరించాడు. పరమశివుడికి సైతం మోహాన్ని కలిగించి, ఆయన యొక్క మనస్సును కలవరపరిచాడు..)

దీనికి ఇంకొక అర్థం కూడా చెబుతారు. విష్ణువు అమ్మవారిని పూజించి అమ్మవారిగా మారిపోయిన సౌభాగ్యమును పొందాడు. మనం ఎవరిని ఉపాసన చేస్తే వారిలా మారిపోతామని పెద్దల మాట. బాలాత్రిపురసుందరీ ఉపాసకులయిన బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రి గారు ఒకరోజు పడక కుర్చీలో కూర్చొని ఉన్నారు. వారి ఇంటికి వచ్చిన వారికి వారు శాస్త్రి గారిలా కాకుండా, ఒక పెద్ద ముత్తైదువగా కనబడ్డారు. "శాస్త్రిగారు ఉన్నారా అమ్మా!' అని ఒకనాడు ఒక తల్లి వెళ్ళి ఆ పడక కుర్చీలో కూర్చున్న అమ్మవారి స్వరూపంలో ఉన్న శాస్త్రి గారిని అడిగింది. ఆయన వెంటనే లేచి, "ఏమి... నేను శాస్త్రిని... నీకు కనబడటం లేదా!?" అని అడిగారు. అమ్మవారి ఉపాసన పదే పదే చేయడం వలన ఆయనయే అమ్మగా మారిపోయే సౌభాగ్యాన్ని పొందారు. అందువలననే రాఘవనారాయణశాస్త్రిగారు శరీరం విడిచిపెట్టినప్పుడు ఆయన శరీరం అగ్నిలో ప్రేలుస్తూ ఉండగా – సాక్షాత్తూ బాలాత్రిపురసుందరీ అమ్మవారు బయటకి వెళ్ళిపోవడం వందలమంది చూసారు. ఇది వార్తాపత్రికలలో కూడా వచ్చింది. ఇదే పద్ధతిలో శ్రీమహావిష్ణువు కూడా లలితాదేవి ఉపాసన చేసే, అమ్మవారిగా అయిపోయాడు. అందుకే కవి శ్రీపతివినుతే అన్నాడు.

సితాసితే! = తెలుపు, నలుపు వర్ణము కలది. **వివరణ :** జ్ఞాన, మాయా స్వరూపిణి అని భావం. తెల్లని అంటే గౌరి. నల్లని అంటే కాళి. పగలు, రాత్రి రూపములతో ఉన్న తల్లి.

శివసహితే! = శివునితో కూడుకొని ఉన్నది. రాకాచంద్రముఖి = పూర్ణచంద్రుని వంటి ముఖము కలది. **వివరణ :** షోడశకళాపరిపూర్ణమైన ముఖము కలిగిన శ్రీదేవి వారాహీ, వైష్ణవీ, కౌమారీ, బ్రాహ్మీ, మాహేశ్వరీ, మహేంద్రీ, చాముండీ, మహాలక్ష్మీ దేవతలచే పరిరక్షింపబడునది. సూర్యుని కిరణాలు చంద్రుని పై పడి వెన్నెల కిరణాలుగా భూమిపైకి చేరతాయి. మన ఆత్మ సూర్యుడు. మన మనస్సు చంద్రుడు. భూమి మన

శరీరం. మనస్సులోని భావాలు ముఖం ద్వారా కనబడతాయి. కనుకనే ముఖాన్ని చంద్రునితో పోలుస్తారు. అమ్మవారి ముఖం షోడశి. (పదహారు కళలు కలిగినది.)

రక్షితకోలముఖి! = కోలముఖి అనగా వారాహి. వారాహి మొదలయిన దేవతలను రక్షిస్తూ, వారిద్వారా లోకాన్ని రక్షిస్తున్న తల్లి. **వివరణ :** కోల అనగా, **కోలతి బాధాం న మత్వా శత్రుం ప్రతి ధావతి,** బాధను తెలియకుండానే శత్రువుపై పరుగెత్తునది. పంది.

రమావాణీసఖి! = అమ్మవారిని అటు ఇటూ కొలుచుకొంటున్న లక్ష్మీ సరస్వతులకు సఖురాలు.

రాజయోగసుఖి! = మోక్షకారకమైన రాజయోగము నందు సుఖము కలిగించునది. **వివరణ :** జన్మకాలమందు మనుజునికి గ్రహయోగమువలన కలుగు మంచిస్థితిని రాజయోగము అని చెబుతారు.

శాకంబరి! = ఒక మంత్రస్వరూపశక్తిమూర్తి. **వివరణ :** శాకంబరి అవతార చరిత్ర దేవీభాగవతములో ఉన్నది. "నూరు సంవత్సరముల కఱువు కలుగగా ఈ శాకంబరి తల్లి అమృతవర్షిణి రాగము గానము చేసినదట. పంటలకు అనుకూలమయిన వర్షమును కురిపించి దేశమును సస్యశ్యామలం చేసిన అవతారమే **శాకంబరి.**

శాతోదరి! = కృశించిన నడుము కలది. ఇది సౌందర్యలక్షణము. **వివరణ :** అనేక (శత) గుహలు (ఉదర) కలిగినవాడు శాతోదరుడు. (హిమవంతుడు). అతనికి సంబంధించిన కూతురు కనుక **శాతోదరి.**

చంద్రకళాధరి! = చంద్రకళను ధరించినది. శంకరి = శివుని పత్ని, **వివరణ :** భక్తులకు శుభములు ఇచ్చునది.

గురుగుహభక్తవశంకరి! = సద్గురువైన కుమారస్వామికి తల్లి. **వివరణ : గూహతి రక్షతి అసౌ** రక్షించువాడు. కనుక కుమారస్వామిని గుహుడు అంటారు.

శ్రీముత్తుస్వామి దీక్షితుల వారి కీర్తనలకు సంబంధించిన గురుగుహముద్ర అని కూడా అర్థం చెప్పుకోవాలి.

ఏకాక్షరి! = ఇది అన్నియు ఒకే అక్షరముగా కలది. **వివరణ :** శ్రీదేవి యొక్క మంత్రములలో కొన్ని ఏకాక్షర మంత్రములున్నవి. ఆ మంత్రములన్నింటియొక్క స్వరూపిణియని భావము. ఓంకార స్వరూపిణి అని ఇంకొక అర్థం.

భువనేశ్వరి = చతుర్దశ భువనములకు (1. భూలోకం, 2. భువర్లోకం, 3. సువర్లోకం,

4. మహర్లోకం, 5. జనలోకం, 6. తపోలోకం, 7. సత్యలోకం, 8. అతలం, 9. వితలం, 10. సుతలం, 11. తలాతలం, 12. మహాతలం, 13. రసాతలం, 14. పాతాళం.) అధికారిణి. **వివరణ :** భువనేశ్వరి అనగా 1. మణిద్వీపం అధీశ్వరి. 2. ఒక మహావిద్య, 3. మాయోపాధిక బ్రహ్మ స్వరూపిణి. భువనేశ్వరి బీజాక్షరం "హ్రీమ్".

ఈ చతుర్దశ భువనాలు మనలోని ప్రజ్ఞాస్థితులను తెలిపే వివిధలోకాలుగా సంకేతిస్తారు. ఈ వివిధప్రజ్ఞాస్థితులలోను అంతర్యామిత్వం వహించునది అని కూడా ఈ నామానికి అర్థం చెప్పవచ్చును.

భు = పుట్టుకకు, వన = వనములకు అనగా జలములకు, ఈశ్వరీ = అధినాయకురాలు అని ఇంకో అర్థం.

ఈశప్రియకరి! = ఈశ్వరునికి ప్రేమాస్పదురాలు, శ్రీకరి = మోక్షమును ఇచ్చునది. **వివరణ :** శ్రీకరి పదములో శ్రీరాగ నామ సూచన ఉన్నది.

సుఖకరి! = ఆనందమును ఇచ్చునది. మహాత్రిపురసుందరి = గొప్పవైన త్రిపురములు కలిగిన సుందరి. **వివరణ :** త్రి = మూడు, పురా = పురములను కలిగి ఉన్నది. స్థూల, సూక్ష్మ, కారణ దేహాలు – అనే మూడు పురాల రూపంలో ప్రతిపాదింపబడునది, లేదా – భూః, భువః, సువః – లోకాల రూపంలో ఉండేది అని అర్థం చెప్పుకోవచ్చును. "పురా" అంటే పూర్వమే (ముందుగానే) ఉండాలి అని అర్థం చెప్పుకుంటే త్రిమూర్తి, త్రికాల, త్రేతాగ్ని, మొదలైన త్రితత్త్వాల రూపంలో ప్రతిపాదింపడే వాటికన్నా ముందే ఉండునది – అని ఈ త్రిపుర నామానికి ఇంకొక అర్థం వస్తుంది.

**తా :** శ్రీ కమలాంబా! నన్ను రక్షించు. ఓ లలితాదేవీ! లక్ష్మీదేవిపతియైన విష్ణువు చేత నుతించబడిన దానా! తెలుపు, నలుపు వర్ణము కలదానా! శివునితో కూడుకొని ఉన్నదానా! పూర్ణచంద్రుని వంటి ముఖము కలదానా! వారాహి మొదలయిన దేవతలను రక్షిస్తూ, వారిద్వారా లోకాన్ని రక్షిస్తున్న తల్లీ! అటు ఇటూ కొలుచుకొంటున్న లక్ష్మీ సరస్వతులకు సఖురాలా! మోక్షకారకమైన రాజయోగమునందు సుఖము కలిగించుదానా!.. మంత్రస్వరూపశక్తిమూర్తిణీ! కృశించిన నడుము కలదానా! హిమవంతుని కూతురా!

చంద్రకళను ధరించినది. శివుని పత్ని సద్గురువైన కుమారస్వామికి తల్లి అన్నియు ఒకే అక్షరముగా కలదానా! చతుర్దశభువనములకు అధికారిణీ! మణిద్వీప (క్షీర సముద్రమధ్యములో పద్మరాగాది మణిమయాంతర్ద్వీపము) అధీశ్వరీ! ఈశ్వరునికి ప్రేమాస్పదురాలు మోక్షమును ఇచ్చుదానా! ఆనందమును ఇచ్చుదానా! గొప్పవైన

త్రిపురములు కలిగిన సుందరీ! స్థూల, సూక్ష్మ, కారణదేహాలు – అనే మూడు పురాల రూపంలో ప్రతిపాదింపబడు దానా!, నన్ను రక్షింపుము.

**వి :** 1. ఈ కీర్తన మంత్రపుష్పం సమయములో లేక మంగళ హారతి ఇచ్చు సమయమున గానము చేయవలసిన మంగళకీర్తన.

2. కామకలాస్వరూపిణియైన శ్రీకమలాంబికను అనేక నామములతో సంబోధించి తన్ను రక్షింపుమని ప్రార్థన హృద్యముగా ఈ మంగళ కీర్తనలో ప్రతిపాదింప బడినది.

3. దీక్షితుల వారు తన నవావరణ కీర్తనలకు ప్రారంభ రచనయైన ధ్యానకీర్తన యందు **పంచదశీమంత్రం** నిక్షిప్తము చేసారు. ఈ మంగళకీర్తనయందు **శ్రీం** అనే కామకలా ఏకాక్షరీ మంత్ర బీజముతో ప్రారంభించి షోడశాక్షరీ మంత్రమును ఈ కీర్తనలో పునశ్చరణ చేసినట్లుగా కనిపిస్తుందని పెద్దలు చెప్పారు. (పంచదశీమంత్రమునకు శ్రీం బీజాక్షరము చేర్చినచో అది షోడశాక్షరీ మంత్రం.) స్వస్తి.

(ముత్తుస్వామి దీక్షితుల వారి నవావరణ కీర్తనలతో కలిపి మొత్తం 11 కీర్తనలకు అమ్మదయవలన నేటితో (22-07-2020) ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలు పూర్తయ్యాయి. ఈ రచనలో 1. శ్రీ ముత్తుస్వామి దీక్షితుల కృతులు (టి.యస్.పార్థసారథి, భావరాజు నరసింహారావు) 2. శ్రీముత్తుస్వామి దీక్షితులవారి కృతులలోని శివశక్తి తత్త్వము (డాక్టర్ వంక లలిత అన్నప్పారావు) 3. శ్రీసామవేదం షణ్ముఖ శర్మగారు జయజయ శంకర టీవిలో శ్రీ నవావరణ వైభవం పై చెప్పిన ఉపన్యాసాలు. 4. శ్రీలలితాసహస్రనామ వివరణము (శ్రీ జియల్‌యన్ శాస్త్రి మరియు నిఘంటువులు ఉపయోగపడ్డాయి. వారందరికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఈ నవావరణ కీర్తనలకు ప్రతిపదార్థ తాత్పర్య విశేషాలు వ్రాయమని మొదట నన్ను కోరిన శ్రీచాగంటి సోమసుందర రావుగారికి ధన్యవాదాలు. వీటిని పుస్తకరూపంలో అందంగా ప్రచురిస్తున్న శ్రీరావి మోహనరావు గారికి ప్రత్యేక ధన్యవాదాలు.

రావి మోహనరాయా! మీరక్తి శక్తి భక్తులకు నా ప్రణుతులివె! ప్రచురణముల యాగమందు దీక్షితులైన మీ గరగల యందు దీక్షితవైభవమందుకొనుడు!

యదక్షర పదభ్రష్టం మాత్రా హీనంతు యద్భవేత్ ।
తత్ సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ నమోస్తుతే.

శ్రీః



# శ్రీః
# శ్రీదేవీఖడ్గమాలా - శుద్ధశక్తిసంబుద్ధ్యంతమాలా

శుక్లప్రతిపది (క) అమావాస్యాయామ్, అస్యశ్రీశుద్ధశక్తిసంబుద్ధ్యన్తమాలామహామన్త్రస్య ఉపస్థేంద్రియాధిష్ఠాయీ వరుణాదిత్య ఋషిః, గాయత్రీ ఛన్దః, సాత్త్విక కకారభట్టారకపీఠస్థితా శివకామేశ్వరాంకనిలయా కామేశ్వరీలలితామహాభట్టారికా దేవతా. ఐం బీజం - క్లీం శక్తిః - సౌః కీలకం - ఖడ్గసిద్ధౌ వినియోగః

ఉపస్థేంద్రియాధిష్ఠాయినే వరుణాదిత్యఋషయే నమః (శిరసి), గాయత్రీఛన్దసే నమః (ముఖే), సాత్త్వికకకారభట్టారకపీఠస్థితాయై శివకామేశ్వరాంకనిలయాయై కామేశ్వరీ లలితామహాభట్టారికాదేవతాయై నమః (హృది), ఐం బీజాయ నమః (గుహ్యే), క్లీం శక్తయే నమః (నాభౌ), సౌః కీలకాయ నమః (పాదయోః) వినియోగాయ నమః (సర్వాంగే) -

**హ్రాం ఇత్యాదినా కరహృదయాదిన్యాసః**

| **కరన్యాసః** | **హృదయాదిన్యాసః** |
|---|---|
| హ్రాం అంగుష్ఠాభ్యాం నమః | హ్రాం హృదయాయ నమః |
| హ్రీం తర్జనీభ్యాం నమః | హ్రీం శిరసే స్వాహా |
| హ్రూం మధ్యమాభ్యాం నమః | హ్రూం శిఖాయై వషట్ |
| హ్రైం అనామికాభ్యాం నమః | హ్రైం కవచాయ హుమ్ |
| హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః | హ్రౌం నేత్రత్రయాయ వౌషట్ |
| హ్రః కరతలకరపృష్ఠాభ్యాం నమః | హ్రః అస్త్రాయ ఫట్ |

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

ధ్యానశ్లోకః: **ఆరక్తాభాం త్రిణేత్రాం మణిమకుటవతీం రత్నతాటంకరమ్యాం**
**హస్తాంభోజైస్సపాశాంకుశమదనధనుస్సాయకైర్విస్ఫురంతీమ్ ।**
**ఆపీనోత్తుంగవక్షోరుహకలశలుఠత్తారహారోజ్జ్వలాంగీం**
**ధ్యాయేదంభోరుహస్థామరుణిమవసనామీశ్వరీమీశ్వరాణామ్ ॥**

**శ్లో॥ తాదృశం ఖడ్గమాప్నోతి యేన హస్తస్థితేన వై ।**
**అష్టాదశమహాద్వీపసమ్రాడ్భోక్తా భవిష్యతి ॥**

(లం, ఇత్యాది పంచపూజాం కుర్యాత్)

లం పృథ్వీతత్త్వాత్మికాయై నమః గంధం పరికల్పయామి
హం ఆకాశతత్త్వాత్మికాయై నమః పుష్పం పరికల్పయామి
యం వాయుతత్త్వాత్మికాయై నమః ధూపం పరికల్పయామి
రం తేజస్తత్త్వాత్మికాయై నమః దీపం పరికల్పయామి
వం అమృతతత్త్వాత్మికాయై నమః అమృతోపహారం పరికల్పయామి

## శ్రీః

# శ్రీదేవీఖడ్గమాలా

**ఐం హ్రీం శ్రీం ఓం నమః**

1. త్రిపురసుందరి

(న్యాసాంగదేవతలు 6)

2. హృదయదేవి
3. శిరోదేవి
4. శిఖాదేవి
5. కవచదేవి
6. **నేత్రదే(వి)**
7. **(అ)వ్యస్త్రదేవి**

(షోడశతిథినిత్యలు 16)

8. కామేశ్వరి
9. భగమాలిని
10. నిత్యక్లిన్నే
11. భేరుండే
12. వహ్నివాసిని
13. మహావజ్రేశ్వరి
14. శివదూతి
15. త్వరితే
16. కులసుందరి
17. నిత్యే
18. నీలపతాకే
19. విజయే
20. సర్వమంగళే
21. జ్వాలామాలిని
22. చిత్రే
23. మహానిత్యే

(గురు మండలం)

24. పరమేశ్వరపరమేశ్వరి
25. మిత్రేశమయి
26. **షష్ఠీశమ (యి)**
27. **(ఉ) య్యుడ్డీశమయి**
28. చర్యానాథమయి
29. **లోపాముద్రామ (యి)**
30. **(అ)య్యగస్త్యమయి**
31. కాలతాపనమయి
32. ధర్మాచార్యమయి
33. ముక్తకేశీశ్వరమయి
34. దీపకలానాథమయి
35. విష్ణుదేవమయి
36. ప్రభాకరదేవమయి
37. తేజోదేవమయి
38. మనోజదేవమయి
39. కల్యాణదేవమయి
40. రత్నదేవమయి
41. వాసుదేవమయి
42. **శ్రీరామానందమ (యి)**

**(భూపురములోని ప్రథమరేఖలోని దేవతలు 10)**

43. **(అ)య్యణిమాసిద్ధే**
44. లఘిమాసిద్ధే
45. మహిమాసిద్ధే
46. ఈశిత్వసిద్ధే
47. వశిత్వసిద్ధే

48. ప్రాకామ్యసిద్ధే
49. భుక్తిసిద్ధే
50. ఇచ్ఛాసిద్ధే
51. ప్రాప్తిసిద్ధే
52. సర్వకామసిద్ధే

(భూపురంలోని ద్వితీయరేఖలోని దేవతలు 8)

53. బ్రాహ్మి
54. మాహేశ్వరి
55. కౌమారి
56. వైష్ణవి
57. వారాహి
58. మాహేంద్రి
59. చాముండే
60. మహాలక్ష్మి

(భూపురంలోని తృతీయరేఖలోని దేవతలు 10)

61. సర్వసంక్షోభిణి
62. సర్వవిద్రావిణి
63. సర్వాకర్షణి
64. సర్వవశంకరి
65. సర్వోన్మాదిని
66. సర్వమహాంకుశే
67. సర్వఖేచరి
68. సర్వబీజే
69. సర్వయోనే
70. సర్వత్రిఖండే
71. త్రైలోక్యమోహనచక్రస్వామిని
72. **ప్రకటయోగిని**

(షోడశదళపద్మమందలి ఆకర్షణదేవతలు 16)

73. కామాకర్షణి
74. **బుద్ధ్యాకర్ష (ణి)**
75. **(అ)ణ్యహంకారాకర్షణి**
76. శబ్దాకర్షణి
77. స్పర్శాకర్షణి
78. రూపాకర్షణి
79. రసాకర్షణి
80. గంధాకర్షణి
81. చిత్తాకర్షణి
82. ధైర్యాకర్షణి
83. స్మృత్యాకర్షణి
84. నామాకర్షణి
85. **బీజాకర్ష (ణి)**
86. **(ఆ)ణ్యాత్మాకర్ష (ణి)**
87. **(అ)ణ్యమృతాకర్షణి**
88. శరీరాకర్షణి
89. సర్వాశాపరిపూరకచక్రస్వామిని
90. **గుప్తయోగి(ని)**

(అష్టదళపద్మమందలి దేవతలు - 8)

91. **(అ)న్యనంగకుసుమే**
92. (అ)ఉనంగమేఖలే
93. (అ)ఉనంగమదనే
94. (అ)ఉనంగమదనాతురే
95. (అ)ఉనంగరేఖే
96. **(అ)ఉనంగవేగి(ని)**
97. **(అ)న్యనంగాంకుశే**
98. (అ)ఉనంగమాలిని
99. సర్వసంక్షోభణచక్రస్వామిని
100. **గుప్తతరయోగిని**

(చతుర్దశారమండలి దేవతు - 14)

101. సర్వసంక్షోభిణి
102. సర్వవిద్రావిణి
103. సర్వాకర్షణి
104. సర్వాహ్లాదిని
105. సర్వసమ్మోహిని
106. సర్వస్తంభిని
107. సర్వజృంభిణి
108. సర్వవశంకరి
109. సర్వరంజని
110. సర్వోన్మాదిని
111. సర్వార్థసాధిని
112. సర్వసంపత్తిపూరణి
113. సర్వమంత్రమయి
114. సర్వద్వంద్వక్షయంకరి
115. సర్వసౌభాగ్యదాయకచక్రస్వామిని
116. **సంప్రదాయయోగిని**

(బహిర్దశారమండలి దేవతలు - 10)

117. సర్వసిద్ధిప్రదే
118. సర్వసంపత్ప్రదే
119. సర్వప్రియంకరి
120. సర్వమంగలకారిణి
121. సర్వకామప్రదే
122. సర్వదుఃఖవిమోచిని
123. సర్వమృత్యుప్రశమని
124. సర్వవిఘ్ననివారిణి
125. సర్వాంగసుందరి
126. సర్వసౌభాగ్యదాయిని
127. సర్వార్థసాధకచక్రస్వామిని
128. **కులోత్తీర్ణయోగిని**

(అంతర్దశార మండలి దేవతలు - 10)

129. సర్వజ్ఞే
130. సర్వశక్తే
131. సర్వైశ్వర్యప్రదే
132. సర్వజ్ఞానమయి
133. సర్వవ్యాధిప్రశమని
134. సర్వాధారస్వరూపే
135. సర్వపాపహరే
136. సర్వానందమయి
137. సర్వరక్షాస్వరూపిణి
138. సర్వేప్సితప్రదే
139. సర్వరక్షాకరచక్రస్వామిని
140. **నిగర్భయోగిని**

(అష్టారమండలి వాగ్దేవతలు - 8)

141. వశిని
142. కామేశ్వరి
143. మోదిని
144. విమలే
145. (అ)ఉరుణే
146. జయిని
147. సర్వేశ్వరి
148. కౌలిని
149. సర్వరోగహరచక్రస్వామిని
150. **రహస్యయోగిని**

(త్రికోణమండలి దేవతలు)

151. బాణిని
152. చాపిని
153. **పాశిని**
154. **(అ)న్యంకుశిని**
155. మహాకామేశ్వరి

156. మహావజ్రేశ్వరి
157. మహాభగమాలిని
158. మహాశ్రీసుందరి
159. **సర్వసిద్ధిప్రదచక్రస్వామి(ని)**
160. **(అ)న్యతిరహస్యయోగిని**

(నవమావరణదేవతానామము)

161. శ్రీశ్రీమహాభట్టారికే
162. సర్వానందమయచక్రస్వామిని
163. పరాపరరహస్యయోగిని

(నవచక్రేశ్వరీనామములు)

164. త్రిపురే
165. త్రిపురేశి
166. త్రిపురసుందరి
167. త్రిపురవాసిని
168. త్రిపురాశ్రీః
169. త్రిపురమాలిని
170. త్రిపురసిద్ధే
171. త్రిపురాంబ
172. మహాత్రిపురసుందరి

(బిందుచక్రేశ్వరీనామములు)

173. మహామహేశ్వరి
174. మహామహారాజ్ఞి
175. మహామహాశక్తే
176. మహామహాగుప్తే
177. మహామహాజ్ఞప్తే
178. మహామహానందే
179. మహామహాస్పందే
180. మహామహాశయే
181. మహామహాశ్రీచక్రనగరసమ్రాజ్ఞి

నమస్తే త్రిః స్వాహా

శ్రీం హ్రీం ఐమ్ (1031)

ఏకత్రింశదధికసహస్రాక్షరాణి

ఇతి శుద్ధశక్తిసంబుద్ధ్యంతమాలా

(పునః అంగన్యాసకరన్యాసౌ కుర్యాత్. ఓం భూర్భువస్సువః ఇతి దిగ్విమోకః)

శ్లో॥ పదోనం క్రియోనం ధియోనం స్వరోనం
మదోనం హి మాతః క్షమస్వ హ్రియోనమ్ ।
దయోనా న హి త్వం ధ్రువం వత్సలా త్వం
సుతం విశ్వనాథం క్రియా విశ్వనాథే ॥

